# వోటు.

గ్రంథకర్త:

గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.

---

ప్రకాశకులు:

ఆంధ్రపరిషత్తు, బెజవాడ.



---

బెజవాడ:

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల (లిమిటెడ్) యందు

క. కోదండరామయ్యచే ముద్రింపఁబడియె.

1923

కాపీరైటు రిజిస్టరుడు. వెల అ 10.

ఈగ్రంథము వలయువారు "గ్రంథకర్తగారికి
నంద్యాల" అని వ్రాయవలెను.

# వైాటు.

రాజ్యము లెట్లేర్పడినది వానిగమన మెట్లు నడచినది యే కాలమున నేయే విధమగు సంచలన మేర్పడినది త్యాది విషయములన్నియు ప్రపంచచరిత్రపఠనముచే దెలిసి నవలసినదే కాని యిచ్చట వివరింపరాదు. అయిన శత తాబ్దములుగ ప్రజలకు ప్రభుత్వమునకు తదధికారులకు జరిగిన ంఘర్షణలచే, రాజ్యస్వరూపమిట్లుండవలెను, రాజ్యముయొక్క మ మీయీవిధముగ ఫలింపగలదు' అనునది యొకవిధముగ ద్ధాంతీకరింపబడినది. నేటిదినము నాగరకరాజ్యము లన్నిటి యందును ఈవిషయమున కొన్నిమూలసూత్రము లంగీకృత ములయి యున్నవి. వానిననుసరించి దినదినమును రాజ్యాంగ ంస్కరణములు జరుగుచున్నవి.

---

## ప్ర జ ప్ర థ మా ధా ర ము.

ఏరాజ్యమునకైనను ప్రజ ప్రథమాధారము. రాజులు ంకుశాధికారులై ప్రవర్తించుచుండినకాలమునందు కూడ జారంజకుడుగానినాడేరాజును బహుకాలము పరిపాలింప వాడుకాలేదు. నిరంకుశపరిపాలనపద్ధతులు నశించుకొలదిని జలప్రాముఖ్యము గణనలోనికివచ్చి నేటియుగమున ప్రజా భుత్వముత్తమప్రభుత్వముగ గణింపబడుచున్నది. ఈసంగతిని క్కగా స్పష్టపరచువానుడు లొకకొన్ని లోకమున ప్రబలి

యున్నవి. ఎంతమంచిపరిపాలనమైనను పరపరిపాలన స్వపరిపా
లనకు సరిపోదని యొకరు నుడివిరి. ఈనుడివ నోటజూచినను ఆదుక
నేయున్నది. అమెరికాసంయుక్తరాష్ట్రాధ్యక్షుడై బానిసముల
ప్రపంచమునుండి పారదోలుటకు తనప్రాణమునర్పించిన అబ్ర
హాములింకను స్వపరిపాలనము నత్యద్భుత భంగిని వర్ణించెను.
ప్రజలమేలుకై ప్రజలే స్వకీయప్రభుతను నెరపుట స్వపరిపాలన
మట. ఈనుడియు లోకోక్తియై చెలంగుచున్నది. ఇట్టివర్ణన
లకుసరిపోవు స్వపరిపాలన మింకను ఎచ్చటను సంపూర్ణముగా
నేర్పడలేదు. కాని వీనియర్థము మాత్రము నేటి నాగరక రాజ్య
ములపరిపాలనయందు ప్రతిఫలించుచున్నది. ప్రజయనుభావమ
నకు రెండవస్థలు కలవు. ప్రతిమానవుడును—స్త్రీయైనను పు
రుషుడైనను—ప్రజయందంగమగుచున్నాడు. ఈయంగము
చేరికయగు దేహము రాజ్యమగుచున్నది. ప్రత్యేకమగు అం
ముల స్వాతంత్ర్యము సంరక్షితమయి వానిధర్మమును అవి ని
ర్వహించినంగాని దేహస్వాస్థ్యము సమకూరదు. దేహావసరము
లు గమనింపబడి దేహధర్మములకు అంగధర్మములు లోబడినం
గాని అంగశక్తి నిలువనేరదు. దేహమును నిలువనేరదు. కాబ
ట్టి(౧) కొన్నినియమములకు బద్ధమై అంగస్వాతంత్ర్యము సంపా
దితము కావలెను. అనగా ప్రతిపురుషునకును ప్రతి స్త్రీకిని
కొన్ని స్వత్వము లేర్పడవలెను. ప్రభుత్వపక్షమునుండిగాని
పరస్పరముగా గాని వ్యక్తులకు కొన్ని సందర్భములలో దక్క

ర్బంధములు పొసగరాదు. దీనినే వ్యక్తిస్వాతంత్ర్యమందుము.
త్రి) ప్రతిపురుషుడును ప్రతి స్త్రీయును రాజ్యదేహమున అంగములని వర్ణించినతరువాత ప్రతిపురుషునకును ప్రతి స్త్రీకిని దేహముయొక్క యవస్థను నిర్ణయించుటయం దధికారము తప్పదు. అనగా, వీర లొక్కొక్కరకును ప్రభుత్వమున పాల్గొనుటకు స్వాతంత్ర్య మున్నది. ఈ స్వాతంత్ర్యమునే రాజకీయ స్వాతంత్ర్య మందుము.

## ద్వివిధ స్వాతంత్ర్యములు.

వ్యక్తిస్వాతంత్ర్యమును రాజకీయస్వాతంత్ర్యమును నీ రెండు స్వాతంత్ర్యములమీఁద నాధారపడి ప్రజాప్రభుత్వములు నిర్మితములైయున్నవి, అగుచున్నవి. ఏనాడు వ్యక్తిస్వాతంత్ర్యము రాజ్యములోని సర్వజనులకును నొక్కరీతినియే ప్రసాదితమగునో ఆనాడు ఆరాజ్యము ఆమట్టుకు స్వపరిపాలనమును పొందిన ట్లెంచవలసియుండును. దీనినే వేరువిధముగ ప్రతిపాదింపవచ్చును. దేశమునందలి శాసనములు జాతిమతవర్ణభేదములనుగాని అంతస్థుభేదములనుగాని పాటింపక యెల్లర నొక్క దృష్టిని చూచుటయే వ్యక్తిస్వాతంత్ర్యమునకు స్పష్టతకి మనదేశములో కొన్నికొన్ని అధికారములును కొన్ని స్థా కారపదవులలో విశేషభాగమును, శాసన స రి యూరోపియనులకు ప్రత్యేకించి పెట్టబడినవి. ఇది

సర్వజనులకును ఒక్కరీతినియే ప్రసాదితమగు వ్యక్తిస్వాతం
త్ర్యముగాదు. ఐరోపియనులు నేరములు చేసినయెడల ఈదేశ
ములోని సామాన్య న్యాయస్థానములలో వారిని విచారించు
టలేదు. ప్రత్యేకముగ కొన్ని న్యాయస్థానములలోమాత్రము
వారివిషయమున చర్య జరుగుచున్నది.* ఇదియు రాజ్యము
లోని సర్వజనులకును ఒక్కరీతినియే ప్రసాదితమగు స్వాతంత్ర్య
ముగాదు. ఉదాహరణము లింకను ఈయవచ్చును. కాని
ఇవి చాలియున్నవి. మనదేశములో ప్రజాప్రభుత్వ మెంత
వరకు స్థాపితమగుచున్నదో కనిపెట్టుటకు శాసనములను
ఈ సూత్రము ననుసరించి విమర్శించి తీర్మానింపవలసి
యుండును. ప్రజాప్రభుత్వమునకు రాజకీయస్వాతంత్ర్యమును
అత్యంతావసరమైన యాధారము. రాజ్యముయొక్క సంకల్ప
మిదియని అన్నిసందర్భములలోను శాసనరూపమున ప్రకటిం
చుటకును ప్రభుత్వాధికారమును నడుపుటకును స్వాతంత్ర్యము
రాజ్యములోని ప్రజలలో నెంత యెక్కుడుసంఖ్యలకునుండునో
అంతయెక్కుడుగ ప్రజాప్రభుత్వము నెలకొనియున్నట్టు నిర్ణ
[illegible]పనగును.

* [illegible] యమున కొన్ని మార్పులు జరుగుననుఆశ కన్పించినది.
[illegible] క్రొత్తగా నేర్పడినచట్టము ప్రాతభేదముల నెక్కువస్పష్టతరము చేసిన
దని కొందర భిప్రాయపడుచున్నారు. అధికార పక్షపాతులుకూడ అన్ని భేద
ములు రద్దయినవని యనుటలేదు.

ఏమాత్రము విభేదములేక రాజ్యములోని ప్రతిపురుషుడును ప్రతిస్త్రీయును సర్వస్వాతంత్ర్యములకు నర్హులుగానుండి అధికారము నిర్వహించుటయందును ఏవిభేదమును లేక ఎల్లరకును సరిసమానమగు బాధ్యతలే యుండునెడల అది యాదర్శప్రాయమగు ప్రజాప్రభుత్వము కాగలదు. కాని, ప్రభుత్వము కార్యనిర్వహణముతో కూడికొనినదగుటచేత ప్రతివిషయమునందును రాజ్యమునందలి లక్షలకొలది కోట్లకొలది ప్రజలు ఒక్కొక్కరును జోక్యముకలిగించుకొనుటకు అవకాశములేదు. కొంచెమాలోచించి చూచునెడల అట్టిస్థితి అనర్థదాయకమునగు ననుట తోచగలదు. ఏదైనను పిండివంట చేయునప్పుడు ఒకడే చేయవలసియుండునుగాని . పదుగురుచేరి చేసినయెడల దాని రుచియే నశించును. పదుగురు పదిపర్యాయములు చక్కెర వేసినయెడల వెగటైపోవును. ఆతీరుననే రాజ్యకార్యనిర్వహణమున కూడ సంఖ్యలకు మితియుండవలసి వచ్చుచున్నది. కార్యనిర్వహణమునకు ఉపక్రమముగాచేయు నాలోచనకుగూడ ప్రతిమానవునకును సమానమగు బాధ్యత కలదనుమాటకు మాటిగా నడచినయెడల నిర్ణయ మసాధ్యము కావచ్చును. సాధ్యమయినను అందరియాలోచనలు విని తీర్మానించునప్పటికి ఏండ్లు యుగము లయిపోయి తీర్మానముయొక్క విలువయే నశింపవచ్చును. ఇట్లగుటచేత పరస్పరము భిన్నములుగాకన్పించు రెండవస్థల సమన్వయము రాజ్యనిర్వహణమున జరుగవలసి

యున్నది; ఇదివరలో జరుగుచు వచ్చినది; ఇప్పుడు జరుగుచున్నది; ఇకముందు జరుగగలదు. ప్రతిపురుషుడు ప్రతిస్త్రీయు సంపూర్ణముగా వ్యక్తిస్వాతంత్ర్యమును రాజకీయస్వాతంత్ర్యమును పొందవలెను. రాజ్యకార్యముల యాలోచనయు నిర్వహణమును తత్తక్షణమున కనువగురీతిని గడవవలెను. వివిధరాజ్యములలో వివిధరీతుల నీసమస్యలను తీర్చుటకు ప్రయత్నములు కాలానుగతముగ జరిగియున్నవి. ఏరాజ్యమున ఎంతవరకు ప్రజలయధికారము సాగుచున్నది యనుట నేటిదినము రెండుపరిస్థితులచే నిర్ణీతమగుచున్నది.

(౧) రాజ్యములో రాజకీయాధికారమును నిర్వహింప నర్హతగల పౌరులసంఖ్య ఏమాత్రముపరిమితిగలది? అనగా రాజ్యములోని స్త్రీపురుషులందు ఏవంతు తమసమ్మతి యసమ్మతిచే రాజ్యకార్యముల పోకడను నిర్ణయించు స్వాతంత్ర్యముగలవారై యున్నారు? ఇది మొదటి పరిస్థితి. ఈపౌరసమూహమునకే నిర్వాచకసంఘమని పేరు.

(౨) నిర్వాచకసంఘమునకు ప్రభుత్వసంబంధులగు ఇతరసంస్థలపై ఏమాత్రము యాజమాన్యమున్నది? అనగా, ఎంతవరకు ఈనిర్వాచకసంఘము ప్రభుత్వాధికారవర్గమును బంధింపగలదు? నిర్వాచకసంఘముయొక్క శక్తి హీనమై ఎప్పుడో యొకప్పుడుగాని పనికిరానిదై సర్వశక్తియు అధికారవర్గము

నందే స్థాపితమయి యుంతు నెడల నిర్వాచక సంఘముయొక్క పరిమితినిబట్టి ప్రజా ప్రభుత్వముయొక్క పరిమితిని నిర్ణయించుటకు రాదు. ప్రజాప్రభుత్వ మనునది పైపేరునకేగాని నిజమునకు లేదనుట గ్రహింపవలసియుండును. ఎప్పుడు నిర్వాచక సంఘమునకు అధికారవర్గముపై నిరంతరయాజమాన్యము కలిగి యెల్లప్పుడును ఆయాజమాన్యమును నడిపించు శక్తియుండునో అప్పుడే ప్రజాప్రభుత్వము వెలసిన ట్లెన్నవలెను. ఇతరసందర్భములలో నిర్వాచక సంఘము రాజ్యవ్యవస్థలలో అత్యుదాత్త వ్యవస్థగా నాలోచించుటకు తగియుండదు.

## శుద్ధ ప్రజా సత్తాకము లేదు.

అందువలన శుద్ధప్రజాసత్తాకమునందు నిర్వాచకసంఘము ఎల్లపౌరులతో చేరుకొనినదై ఎల్లరాజకీయయాజమాన్యమును తానే వహించునదయి యుండును. అయిన లోకములో నేరాజ్యమునందునూ నిర్వాచకసంఘమునందందరు పౌరులును నుండుట పొసగలేదు. పౌరులలో కొంతభాగముమట్టుకు నిర్వాచకసంఘముగా గణింపబడుచున్నది. ఇట్లేర్పడిన నిర్వాచక సంఘముకూడ ఎల్లరాజకీయయాజమాన్యమును తానే వహించుచుండుటకు సమర్థము గాదు. కాబట్టి ప్రతిరాజ్యమునందును నిర్వాచకసంఘనిర్ణయమున కేర్పడియుండు నియమములనుబట్టియు ఆనిర్వాచక సంఘమునకు ఇతర రాజకీయసంస్థలలోనుండు పలుకుబడినిబట్టి

యు ప్రజాప్రభుత్వపు స్వరూపము నిశ్చిత మగుచుండును. ఇంతేకాదు. రాజ్యములోని ప్రజలందరును ఒకేయభిప్రాయ మిత్తురనుట కల్ల. అందుచేత కార్యజాలము ఎక్కువసంఖ్యాకుల యభిప్రాయానుసారము జరుగవలసియుండును. అట్లయిన తక్కువసంఖ్యాకుల గతియేమి? వారెప్పుడును నోరులేనివారుగ పడియుండవలసినదేనా? వారియభిప్రాయము లోకకొంత యాలోచనలోనికి వచ్చుటకు మార్గముకలదా ? ప్రపంచములోని నాగరకరాష్ట్రములు ఈవిషయమును విమర్శించుకొనినవి. తక్కువసంఖ్యాకుల యభిప్రాయములకు నుచితమగు గణ్యతను ఇచ్చుటకు నిశ్చయించినవి. * తక్కువసంఖ్యాకులు తమసంకల్పములను వ్యాపింపజేసికొనుటకు న్యాయబద్ధమార్గములను నియమించుటకు ప్రయత్నించినవి.

## విషయము.

కాబట్టి ప్రస్తుతకాలమున నిర్వాచకసంఘ నిర్మాణమునకు రాజ్యము ఏర్పరచిన మెల్లలు; ఇతరరాజ్యాంగసంస్థలపై తమకుగల యాజమాన్యముమూలముగా నిర్వాచకసంఘములు రాజ్యకార్యముల నిర్వహించు పరిమితి; ఇతరసంస్థల యాటంక

* లోకమునందు నేటిదినము జీవితమంతయు పోటీసిద్ధాంతముపై ఆధారపడి పశుబలమే అధికారమునకు పునాదియైనందుచేత ఈగణ్యత కర్థము లేకున్నది. దీనికిఅర్థముకలుగుటకు ఎట్టిపరిస్థితు లేర్పడవలయునో అనుబంధమునందు సవిమర్శగా వివరించితిని. అఘట్టము చూచునది.

ములేక నిర్వాచకసంఘములే నిర్వహించు రాజ్యకార్యసరణి; తక్కువసంఖ్యాకుల సంకల్పప్రకటనకును సంరక్షణకును సృష్టితమయిన యనుకూలములు—ఇవియెల్లయు నీగ్రంథమునకు విషయము.

## నిర్వాచక వర్గము.

ప్రజాప్రభుత్వమును వెలయఁజేయుటకు ఇటీవలఅన్ని దేశములలోను నిర్వాచకవర్గమును క్రమక్రమముగా పెంచుచుండుట ఆచారమయినది. ఎల్లకాలములయందును ఎల్లరాజ్యములలోను పౌరులు పౌరులుకానివారు అనుభేదము చేయఁబడుచు వచ్చియున్నది. ఆర్యులు దండెత్తివచ్చి రాజ్యస్థాపనము చేసికొనినప్పుడుగూడ తమకు ప్రతిస్పర్థులుగానుండిన దస్యులను పౌరత్వమునుండి దూరముచేసినట్లు నిదర్శనము లున్నవి. ఇట్లే పాశ్చాత్యభూములలోను జరిగినది. చారిత్రకపరిణామమును బట్టి చూడగా మొట్టమొదట పౌరత్వము రక్తసంబంధులకు మాత్రమే వ్యాపించినట్లును మధ్యకాలమున రాజు, సేనాని, ఇత్యాదుల ఆప్తవర్గమునకు వ్యాపించినట్లును తోచుచున్నది. నేటిదినమును ఈభావము లోకమునుండి నశింపలేదు. దక్షిణాఫ్రికాలోను, తూర్పుఆఫ్రికాలోను, ఇతరప్రాంతములను, మనసోదరులుపడు కడగండ్లకు కారణము వా రాయా ప్రాంతముల పౌరులుగా అచ్చటి ప్రభుత్వములవారిచేత సంపూర్ణముగా

నంగీకృతులు కాకపోవుటయే, రక్తసంబంధములకు మాత్రము ఆప్తవర్గమునకుమాత్రము, ఆప్రభుత్వములు పౌరత్వ శాధ్యతలను వ్యాపింపజేయుటచేతినే, ఇట్లు అచ్చటచ్చట, ముఖ్యముగా అంకితభూముల సంబంధములలోను, నల్ల తెల్ల జాతుల సంబంధములలోను, ఇప్పటికిని పూర్వపుఛాయలు కన్పించుచున్నను రక్తసంబంధమును ఆప్తవర్గసంబంధమును నేడు పౌరత్వమునకర్హసాధనములుగ గణింపబడుచుండలేదు. దేశజత్వమును దేశనివాసమును పౌరత్వమునకు మూలాధారములైనవి, అగుచున్నవి. పౌరత్వమునకు సంబంధించి ఎల్లప్పుడును కొన్ని స్వాతంత్ర్యములును కొన్ని జవాబుదారీలును కలవు. ప్రభుత్వమువారి సంరక్షణకు తప్పక పాత్రుడగుట పౌరుని హక్కు. ప్రభుత్వమునకు అంకితుడైయుండుట అతని జవాబుదారి. ఇట్టిహక్కును ఇట్టి జవాబుదారియును కలపౌరులు రాజ్యమునందున్నను వీరందరకును రాజ్యనిర్వహణమున తమ సంకల్పమును ప్రవర్తింపజేయుటకు అధికారము కలుగుచుండలేదు. అట్టి అధికారముకలవారు పౌరగణములో కొంతభాగముగానుండుచు వచ్చినారు. ప్రాచీనకాలములలో రాజ్యపరిమితి మిక్కిలి తక్కువగానుండి యొకపట్టణముమాత్రము రాజ్యముగా గణింపబడినప్పుడు పౌరులలో ఎక్కువభాగము రాజ్యనిర్వహణాధికారము నందియుండిరి. గంగాతీరముల నార్యులు నివసించియున్నకాలమున వైసాలి ఇత్యాది ప్రాంతములలో

ప్రజలమంతయు జేరి రాజ్యాధిపతిని నిర్వచించికొనినట్లు తెలియుచున్నది. గ్రీసుదేశమునందలి పట్టణరాజ్యములలోను రోము ప్రజాసత్తాకముగానున్నకాలమునను పౌరులలో నెక్కువసంఖ్యాకులు రాజ్యనిర్వాహణాధికారము కలవారై యుండిరి. పౌరులయధికారమునకు నిర్బంధములు మిక్కిలి తక్కువగా నుండినవి. కాని యైరోపాఖండమున రోమక సామ్రాజ్యము పెరుగనారంభించుటతో పౌరుల స్వత్వముల యభివృద్ధి నశించిపోయి ఆంగ్లభూమిలో జాతీయప్రభుత్వ మేర్పడువరకును తలయెత్తినదికాదు.

ప్రాచ్యదేశములలో అందులోను, మనదేశములో నిర్వాచకసంఘములో, అందుకు ప్రత్యామ్నాయములో, వెలయక పోలేదు. నేడు మనము అనుకొనురీతిని నిర్వచనము మనదేశములో జరుగుచుండినను జరుగకున్నను మనసంఘజీవనమంతయు ప్రజల యనుమతి సాహచర్యముమీదనే ఆధారపడియుండె ననుటకు ప్రబలమగు కారణము లనేకములున్నవి. వాని విస్తర ప్రశంసకు నిది సమయముకాదు. దక్షిణదేశమున నేటి పట్టణపాలకసంఘములబోలిన సంఘము లుండెననియు స్త్రీలుసయితమట్టిసంఘములకు సభ్యులను నిర్వచించుచుండిరనియు శంకరనాయరుగారు వ్రాసినవిషయమును, పంచాయతులు బ్రిటిషుపరిపాలనపద్ధతులు ప్రబలువరకు బలవత్తమమయి

యుండి నిన్న నేడు నశించినవని లోకప్రసిద్ధమైయుండు విషయమును, ప్రజ పరస్పరసహకారపద్ధతిమీద నాధారపడి వివిధవృత్తిసంఘములుగా గ్రామముల నివసించి తమలో తాము సర్వకార్యముల నిర్వహించుకొనుచుండిరను చారిత్రిక విషయమును జ్ఞాపకముంచుకొనిన చాలును.

నేటిదినము మనరాజ్యాంగ పరిణామమంతయు మన యిష్టమున్నను లేకున్నను పరిస్థితుల ప్రోద్బలమున ఆంగ్లపద్ధతులను పాశ్చాత్యపద్ధతులను అనుకరించుటచేత వానివిమర్శ మనకత్యవసరము. కాబట్టి వాని ప్రవృద్ధిమార్గము మనకు తాత్కాలికముగా నెరుంగదగినది యనుటకు సందియము లేదు.

ఆంగ్లభూమిచరిత్ర ప్రారంభమగునప్పటికి అచ్చట స్థానికసంస్థలు స్వతంత్రముగ గన్పించుచున్నవి. గ్రామసీమలలో యోధులును పీరులును సభలుచేరి తమకుసంబంధించిన సర్వవిషయములను చక్కపెట్టుకొనుచుండిరి. మండలకార్యములను మండలసభలు నిర్వహించుకొనుచుండినవి. ఆమండలసభలకు గ్రామసభలు పట్టణసభలు తమతమ ప్రతినిధుల నెన్నుకొని పంపుచుండినారు. కొంతకాల మీరీతిని ప్రభుత్వకార్యములు జరుగునప్పటికి ఆంగ్లభూమి కొంతవఱకు పరులదాడికి పాలై నూతనరాజ్యనిర్వహణపద్ధతులకు లోబడవలసివచ్చెను. చాల

కాలము అచ్చట అమలులోనుండినపద్ధతికి ఫ్యూడలిజము అని పేరు. ఆపద్ధతిని సామంతపరంపరపద్ధతి యని వర్ణించి నను వర్ణింపవచ్చును. రాజులు సైనికవర్గముతో తోడ్పడు షర త్తుమీఁద గొప్పభూభాగములు సామంతులకు సంక్రమించుచు వచ్చెను. సామంతులకు ఉపసామంతు లేర్పడుచు వచ్చిరి. అట్లు గుటంజేసి యీపద్ధతి ప్రబలినంతకాలము నిర్వాచకాధికారము ఎక్కువగా భూస్థితిని ననుసరించి నిర్ణీతమగుచు వచ్చెను. అయిన ప్రజల ప్రతిష్ఠాపనలుమాత్రము అంతరింపలేదు. సామంతపరంపరపద్ధతి ప్రజలదాడికి నిలువలేక తుదకు రూపు మాసెను. కాని, నిర్వచనాధికారమునకు భూస్థితి యొక ముఖ్యాధార మనుటమాత్రము ఆంగ్లరాజ్యప్రవర్తనమున నిలి చిపోయినది. ఇదియే కొంతవరకు లోకమంతటను వ్యాపిం చినది. నేడు మనలనుగూడ నియ్యది బాధించుచున్నది. ఫ్యూడలిజ మంతరించిన తరువాత ఆంగ్లభూమిలో మతచర్చలు మొదుగా బయలుదేరి వైషమ్యములు ప్రబలి పోరాటములు జరిగినందున కొంతవరకు మతవిషయకార్హతానర్హతలును నిర్వాచక వర్గనిర్ణయమునకు నాధారములయినవి.

పదునెనిమిదవ శతాబ్దమున నైరోపాఖండమునందు నూతనసిద్ధాంతములు ప్రబలజొచ్చెను. జన్మతో మానవుడు కొన్ని హక్కులను సంపాదించుచున్నా డనియు, మానవులందరు

ను సమానులనియు, ప్రజయే పరమాధికారియనియు, భావప్రపం చమునందు నూతనాందోళనము మిన్నుముట్టెను. అంతట ప్రతి పురుషుడును నిర్వాచకసంఘమున నుండ నర్హుడు కాబట్టి నిర్వచనాధికార మందరకు నుండవలయునను నుపక్రమము రాజకీయవాతావరణమున బలవత్తమముగ జూపట్టెను. పరాసు భూమిలో మహావిప్లవ మీకారణముచేత తటస్థించెను. అచ్చట మొట్టమొదట ప్రతిపురుషుడును రాజ్యకార్యనిర్వహణార్హుడని యంగీకృతమయ్యె. అమెరికాసంయుక్తరాష్ట్రములలో నివాస మేర్పరచుకొనియుండినవారు ఆంగ్లేయులు. కాని, ఆరాష్ట్రములకు వీరలు వలసపోవుటకు ముఖ్యకారణము మతస్వాతంత్ర్యేచ్ఛ కాబట్టి అచ్చటిసంస్థాపనలలో సామంతపరంపరపద్ధతికి అవకాశ ముండలేదు. నిర్వాచకసంఘము సాధ్యమయినంత విరివిగా నుండినది. పదునెనిమిదవశతాబ్దపు నూతనభావవీచికలు అమెరికా జేరుటతో నదివరకే ధారాళదృష్టితో జూడబడుచుండిన రాజ్యాంగసమస్య మొక్కుడుధారాళదృష్టితో జూడంబడి నిర్వాచకసంఘము ఎక్కువ వ్యాప్తినందెను. తరువాత నేర్పడిన ప్రభుత్వములు ఇంగ్లండునకంటె నెక్కువగా పరాసుభూమిని అమెరికాను అనుకరించి వానిని మించి నిర్వాచకసంఘమును నిర్మించుకొనినవి. ఆంగ్లభూమిలోను ౧౮౩౨వ సంవత్సరము మొదలు ఎన్నియో సంస్కరణములు జరిగి నేటికి స్త్రీలకుకూడ నిర్వాచనాధికారము ప్రసాదితమయినది.

నేటిదినము లోకములోని రాజ్యములలో కొన్నిటమాత్రము ప్రజలసంఖ్యలో సగమువంతు నిర్వాచకవర్గమునందు చేరియున్నది. వయసువచ్చినవారందరును నిర్వాచకులుగా నుండనర్హులని నిర్ణయించియుండు న్యూజీలండువంటి ప్రాంతములలోమాత్రము నిర్వాచకవర్గ మింతవిరివియై యున్నది. తక్కుంగల రాజ్యములలో విస్తారతమనిర్వాచకవర్గము కలచోట మొత్తముప్రజలలో నైదవవంతువరకును నిర్వాచకు లున్నారు. ఈరీతిని నిర్వాచకవర్గము పరిమితమగుటకు పరంపరగా వచ్చిన కారణములు కొన్ని, ఆప్రాంతముల అనుకూలానకూలములనుబట్టి నిర్ణయింపబడిన నిర్బంధరూపమగు కారణములు కొన్ని గలవు. వానినీక్రింద వివరింతుము.

వయస్సు: రాజ్యకార్యవిషయములలో జోక్యము కలుగజేసికొనుటకు మానవునకు ఉచితానుచితపరిజ్ఞానశక్తి యుండవలెనని ఎల్లరాజ్యములవారును అంగీకరించియున్నారు. అందుచేత ఒకానొకవయస్సు వచ్చువరకు మానవుడు నిర్వాచకవర్గములో చేరుటకు నర్హుడు కాడనుసిద్ధాంతము కలదు గాని యీ వయస్సునిర్ణయముమాత్రము వివిధరాజ్యములు వివిధరీతుల చేసియున్నవి. అమెరికాసంయుక్తరాష్ట్రములును పరాసుభూమియు ఆంగ్లభూమియు ఇరువదియొక్కసంవత్సరములకు లోబడినవారిని అనర్హులుగా గణించుచున్నవి. జర్మనీలో ఇరువది

వైదేండ్లు వచ్చినగాని నిర్వాచకత్వమునకు అర్హతయేర్పడదు. స్విట్జరులాండులో ఇరువదియేండ్ల ప్రాయముననే మానవుడు నిర్వచనాధికారార్హుడుగ పరిగణింపబడుచున్నాడు. ఆంగ్లాచారమును అనుసరించి మనదేశములోను ఇరువదియొక్క సంవత్సరములే అర్హావయస్సుగ నంగీకృతమయియున్నది. ప్రాచీనకాలముయందువదునారేండ్లేమనదేశమునపరిమితిగానంగీకృతమయినట్లు కొన్నికారణములనుబట్టియూహింపదగియున్నది.* ఎట్లైనను ఈయర్హావయస్సుసమస్య ఎల్లదేశములలోను సామాన్యముగా ప్రజలలో సగమువంతువరకును నిర్వాచకాధికారమునకు ననర్హులను జేయుచున్నది.

జాతి: ప్రథమమున నెల్లరాజకీయాధికారమును క్షాత్రశక్తిమీదనే ఆధారపడియుండినది. నాగరకము ముదిరినదనుకొనుచు లోకశాంతిని నెలకొల్పు ప్రయత్నములు చేయుచున్నామని వీఱ్ఱవీగుచు సర్వభ్రాతృత్వమును మానవుడు దిగంతములకు చాటుచుండు నేడింకను రాజకీయాధికారము గుండ్లు, ఫిరంగులమీదనే ఆధారపడియుండుట స్వయంప్రకాశము, సర్వజనవిదితము. ఇట్టిసందర్భములలో క్షాత్రశక్తికి సదనము

* ఇది మనశీతోష్ణస్థితుల ననుసరించి యున్నది. పాశ్చాత్యదేశములలో ఇరువదియొక్క ఏండ్లకు మానవుడు గడించు ననుభవము ఇచ్చట పదునారేండ్లకే యలవడుచున్నది.

కాని స్త్రీజాతికి నిర్వాచక స్వాతంత్ర్యము కలుగకపోవుట వింత కాదు. ఒకపర్యాయము మన ప్రాచీనచరిత్రవంకకు దృష్టి నిగుడ్చి చూచితిమేని ఆర్యులు ప్రశాంతిమై గంగాసింధువుల మధ్యభూములలో కాలము గడుపునప్పుడు ఋగ్యుగమున స్త్రీల కెక్కువపలుకుబడి యుండుటయు తరువాతియుగమున క్షాత్రమే యాధారముగా మనవలసివచ్చినపట్టున వారి పలుకుబడి నశించుటయు స్పష్టముగా గాంచనగును. ఇట్లే ఇతర ప్రదేశములలోను సంభవించినది. గ్రీకు రాజ్యములలోను రోమకసామ్రాజ్యమునను తరువాత ఐరోపాలో క్యూడ్యాటను ప్రభుత్వములు ప్రారంభమైనప్పుడును ఎల్లప్పుడును ఆయా యుగమునకు సంబంధించిన యోధవర్గమే నిర్వాచకవర్గముగా నేర్పడుచు వచ్చినది. నేటి పాశ్చాత్య రాజ్యములు ఏర్పడునాటికి స్త్రీలు శాసనదృష్టిలోను ఆర్థికముగాను పోషితులుగా నుండినారు. ఈ పోషితస్థితియే నేటికిని అనేకదేశములలో అనేకవిధముల విస్పష్టమగుచున్నది. భాషలలోనే యియ్యది గర్భితమయియున్నది. ఆంగ్లభాషలో స్త్రీలను 'ది వీకర్ సెక్సు' అని వర్ణించెదరు. ఇంచుకు సరిపోవునట్టి పారిభాషికపదము మనభాషలలోను 'అబలలు' అని కలదు. మనదేశములో 'భరింపబడునది' కాబట్టి భార్య యని వివాహితయగు స్త్రీకి అన్వయింప జేయుచున్నాము. అయినను స్త్రీలకు సంపూర్ణమగు నవస్వాతంత్ర్యమిచ్చుటను నిర్ణీతము కాలేదు. మనదేశములో రాణీసంయుక్త, ఝాన్సీ లక్ష్మీబాయి, అహల్యాబాయి, రుద్రమదేవి యిత్యాదులు

రాజ్యభారమును కలియుగమునందు నిర్వహించినవా రున్నారు. పాశ్చాత్యదేశములలో విక్టోరియామహారాజ్ఞివంటివార లెందరో కన్పించుచున్నారు. సర్వసామాన్యముగా పురుషులతో బాటు స్త్రీలు రాజ్యకార్యముల స్వతంత్రులుగా నుండవచ్చు నను సిద్ధాంతముమాత్రమింకను సర్వత్ర ఏర్పడలేదు. పాశ్చాత్య దేశములలో ఫరాసువిప్లవము జరిగినప్పుడుమాత్రము ఎవ్వరో కొందరు భావోన్మత్తులు స్త్రీపురుషుల కెల్లరకు నిర్వాచకాధికార ముండవలెనని ప్రకటించిరిగాని పదితొమ్మిదవశతాబ్దమున నర్ధభాగము గడచిపోవువరకును స్త్రీస్వాతంత్ర్యవిషయము తలపెట్టనైన తలపెట్టినవారు లేరు. నేటికిని ఇంకను స్త్రీస్వాతంత్ర్యవాదినులు అనేక దేశములలో పోరాటము పెట్టవలసియే యున్నారు. న్యూజీలండు ఆస్ట్రేలియాలలో స్త్రీలకు నిర్వాచకస్వాతంత్ర్యము సంపూర్ణముగా నిచ్చియున్నారు. సంయుక్తరాష్ట్రములలో తొమ్మిదింటమాత్రము స్త్రీపురుషులకు సమానమగు నిర్వాచకస్వాతంత్ర్య మొసంగబడి యున్నది. అచ్చటి మరికొన్ని రాష్ట్రములలో స్థానికవిషయములలోమాత్రము అందులో ముఖ్యముగా విద్యకు సంబంధించిన విషయములలో స్త్రీలకు నిర్వాచకాధికార మున్నది. పెద్దపోరాటములయి మిసెస్‌పాంకుహరుస్టు ఇత్యాది వీరవనితలు కారాగారములలో మగ్గి భోజనాదులను తిరస్కరించి నిలిచి యాందోళన చేసినమీందట మహాసంగ్రామఫలముగా ఆంగ్లస్త్రీలలో ౬౦ లక్షలమందికి ఇటీవలనే నిర్వచనాధికారము కల్గినది. ఇక ఐరోపాఖండమంతటను జూడగా ఒక్క ఇటాలియాలో

మాత్రము ఆస్తిగల విధవలకు జాతీయరాజ్యాంగసభలకు సభ్యులను నియమించు నధికార మున్నది. మన హైందవ భూమిలో ప్రజాభిప్రాయము దేశీయసభలమూలకముగను రాష్ట్రీయసభలమూలకముగను బహిరంగసభలమూలకముగను స్త్రీస్వాతంత్ర్యపక్షమున నున్నట్లు వ్యక్తమైనను యిప్పటి కింకను ఏదో నల్వురు స్త్రీలకైనను ఉత్తమరాజ్యాంగ సభలకు సంబంధించిన నిర్వాచనాధికారము సమకూర లేదు. క్రొత్తశాసనము ననుసరించి ఏర్పడియుండు శాసనసభలు ఈవిషయమును విమర్శింపవలసియున్నవి. ఒక్క మద్రాసు స్థానికశాసననిర్మాణసభయందుదప్ప మరియెచ్చటను స్త్రీస్వాతంత్ర్యవాదము ఇప్పటి కింకను కొంచెమునకుకొంచమైనను ఆమోదితము కాలేదు. అచ్చటచ్చట పురపాలకసంఘములకు సభ్యులను నిర్ణయించు నధికారముమాత్రము మనదేశమున కొందరు కొందరు స్త్రీలకు ప్రసాదిత మయియున్నది. స్త్రీలకు నిర్వాచనాధికార ముండుట శ్రేయస్కరమా కాదా యనుచర్చ ఈఘట్టమున నవసరము కాదు. లోకమునందలి రాజ్యములలో క్రొత్తగానేర్పడు రాజ్యములయందు స్త్రీజనసంఖ్య పురుషులకంటె నెక్కుడుగా నుండుపట్ల స్త్రీలకు నిర్వాచకస్వాతంత్ర్యములు కలిగి యున్నవేకాని తక్కుంగలచోట్ల ఈస్వాతంత్ర్యము మిక్కిలి పరిమితమై యున్నది. ఇది నిర్వాచకవర్గము యొక్క మొత్తమును తగ్గించునట్టి శక్తులలో నొక్కటి యనుట గమనింప దగినది.

పౌరత్వము:—నేటిదినము లోకములో రాకపోకలు మెండై యున్నవి. ఒకరాజ్యములోనే భిన్నభిన్నరాష్ట్రముల యందు పరస్పరముగా ప్రజలు వచ్చుచు పోవుచు నుండుట కలదు. వేరువేరురాజ్యములవారు వ్యాపారాదులకు తమకు చెందని రాజ్యములకు పోయివచ్చుచుండుట అహరహము జరుగుచున్నది. రైళ్లు, స్టీమరులు, విమానములు నేల నాలుగు చెరగులును నొక్కచోట చేర్చి యున్నవి. దూరభూమి యను మాటకు నేడెంతో యర్థము లేదు. కాబట్టి యెల్లరాజ్యములలోను ఎల్లకాలములలోను యాతాయాతజనము కొంత వరకు తప్పదు. నేడువచ్చి రేపుపోవువారలకు పదిరోజు లుండి పదునొకండవరో జేగువారలకు రాజ్యవిషయములలోగాని స్థానికవిషయములలోగాని ఆసక్తి యుండుననుట కల్ల. కాబట్టి నేటి నాగరకరాజ్యము లన్నిటియందును విదేశజులైనవారికి నిర్వాచక స్వాతంత్ర్యము లిచ్చావిషయమున నియమము లేర్పడి యున్నవి. ఇతరాలోచనలును ఈనియమములలో నెక్కువ చిక్కులను దెచ్చిపెట్టి యున్నవి. కొన్నిరాజ్యములలో నిర్వాచకాధికారము పొందుటకు మానవుడు పరంపరాగతముగ దేశజుడైనను కావలెను, లేదా దేశజుడై దేశనివాసియై పరంపరాగతదేశజులతో సమానుడైయైనను నుండవలెను. అమెరికాసంయుక్తరాష్ట్రములలో ననేకములయందు విదేశజుడు తా నమెరికాపౌరుడ నగుదు నని తెలిసినంతనే నిర్వాచకాధికార మతనికి సంక్రమించుచున్నది. అయిన నతనికి రాష్ట్రనివాసము విధింపబడుచున్నది. ప్రజలు మిక్కిలి

యెక్కువగా తిరుగుటకు అలవాటుపడిన వారగుటచేత ఈరాష్ట్రములలో ముప్పదిరోజులు మొదలు రెండు సంవత్సరముల మితివరకును తత్తత్ప్రదేశ నియమము ననుసరించి అభ్యర్థి నివాస ముండినవాడు కావలసియున్నాడు. ఏమండలమున నివాసము కలదో ఆమండలముననే అతఁడు నిర్వచనాధికారము నుపయోగింప నగును. ఆంగ్లభూమిలోను ఇట్టినియమములే కొన్ని కలవు. మహాసంగ్రామానంతరము పరదేశజుల స్వాతంత్ర్యములను ఎప్పటికంటె నెక్కువగా తగ్గించుటకై ఆంగ్లేయు లనేకవిధముల ప్రయత్నములు చేయుచున్నారు. అయిన నాంగ్లభూమిలో నొకక్రొత్తవిశేష మొకటి కలదు. ఎన్నినిర్వాచకమండలములలో నియమితగుణము తనకు కలదో అన్నిమండలములలోను పౌరుడు తనయధికారమును అన్నిపర్యాయములును వినియోగించి సమ్మతు లీయవచ్చును.

కొన్నికొన్నిరాజ్యములలో దేశజులైన కొన్నితెగలకు నిర్వచనాధికారము లేదు. ప్రజాప్రభుత్వ ముత్తమరీతిని ప్రవృద్ధియైన స్థానమని పేరుగాంచిన అమెరికాసంయుక్తరాష్ట్రములలోనే విదేశజులగు మంగోలియావారిని పౌరులు కానిచ్చుట లేదు. ప్రత్యేకితమగు స్థానములలో నివసించునట్టి ఎఱ్ఱఇండియనుల గతియు నిట్టిదియే. ఇంతియగాక కొన్ని రాష్ట్రములయందు అచ్చటనే జన్మించిన మంగోలియనులకు కూడ పౌరత్వము ప్రసాదింపబడుట లేదు. నీగ్రోలకు నిర్వచనాధికార మున్నదని పేరేగాని అమెరికాసంయుక్తరాష్ట్ర

ములకుజేరిన దక్షిణరాష్ట్రములలో నిర్వాచనపద్ధతులకు సంబాధించిన కట్టుదిట్టములచే నీయధికారము లేకుండచేయబడుచున్నది. రాజ్యములో పుట్టి పెరిగి స్వత్వములుగల కొన్ని తెగల నీరీతిగా పౌరత్వమునుండి బహిష్కరించుట అనాగరక జాతుల సందర్భమునమాత్రమేగాక నాగరకజాతుల సందర్భమునను జరుగుచున్నది. ఆంగ్లసామ్రాజ్యములోని దక్షిణాఫ్రికా, తూర్పుఆఫ్రికా, కానడాలలో మన హైందవులకుండు స్వాతంత్ర్యములను పరిశీలించినచో దీనికితగిన తార్కాణమేర్పడగలదు. ఆదేశములలో కొన్నిట మనసోదరులకు ఇతరులతో సమానముగా పట్టణపాలకసంఘములకు ప్రతినిధుల నిర్వాచించు నధికారమైనను లేదు. ఇతరులతోసమానముగా ట్రాముబండ్లలో ప్రయాణముచేయు స్వాతంత్ర్యమే లేనప్పుడు ఇదియొక చిత్రముగాదు.

ఆస్తి:—సామంతపరంపరపద్ధతి రాజ్యాంగ నిర్వహణమునందు ఐరోపాఖండమంతట వెలసియుండినకాలమున నేటి నిర్వాచకవిధానము జన్మమందినందున ఆస్తికలవాడు నిర్వాచనాధికారముపొందుటకు తగినవాడను సిద్ధాంతము బహుకాలానుగతమైనది. సంవత్సరమునకు రు 30ల భూమిశిస్తు చెల్లించు నతడే ఆంగ్లభూమిలో బహుకాలమువరకును నిర్వాచకవర్గమున చేర నర్హుడుగా నుండినాడు. తరువాత కొన్నిశతాబ్దములవరకుచు నిజమైనఆస్తికలిగి పన్ను చెల్లించువాడే గణనీయుడగుచు వచ్చినాడు. ఆస్తికలవానికి సంఘముయొక్క లాభా

లాభములతో జోక్యము కలదు గనుక ఆతనికే నిర్వచనాధికార ముండతగుననియు ఊరుపేరులేని పౌరుల కూరక యిట్టి యధికార మీయరాదనియు సిద్ధాంత మేర్పడియుండినది. నేడీసిద్ధాంతముమాత్రి మెవ్వరును ఆంగ్లసీమలో చెప్పకొనుట లేదు. చెప్పకొనజాలరు. కాని దీనిలోకలోని విషముమాత్రి మింకను సంపూర్ణముగా ఆంగ్లసీమను వదలిపోలేదు. అమెరికాసంయుక్తరాష్ట్రములలోనుగూడ అచ్చటచ్చట ఈసిద్ధాంతపు మాహాత్మ్యము కాన్పించుచున్నది. అయిన నచ్చట దీనిని రూపుమాపుప్రయత్నములు సంపూర్ణముగా జరిగియున్నవి. సంయుక్తరాష్ట్రముల కన్నిటికిని అన్వయించు సంయోగశాసనము ననుసరించి యేరాష్ట్రప్రభుత్వముగాని ఆరాష్ట్రములోని యుక్తవయస్కులగు పురుషుని కెవ్వరికిని నిర్వచనాధికారము లేకుండ జేయరాదట. అట్లు చేసినయెడల సంయుక్తశాసనసభలో తదనుగుణముగా ఆరాష్ట్రమునకుగల ప్రాతినిధ్యము తగ్గించబడునట. ఈనియమ ముండియు కొన్నికొన్ని రాష్ట్రములలో కొంతపన్ను చెల్లించుట నిర్వాచకాధికారమునకు ముఖ్యాంగముగా పరివర్తించుచున్నది. ఇక ప్రష్యాలో చూచితిమా ఆ స్తికి అనుగుణముగా నిర్వాచకాధికారము పంచిపెట్టబడుచున్నది. మండలములోని పన్నుమొత్తము మూడుసమభాగములుగా విభజింపబడుచున్నది. పెద్దమొత్తము లిచ్చువారు ఒక తెగ. సామాన్యములగు మొత్తము లిచ్చువారు ఇంకొక్క తెగ. తక్కువ మొత్తము లిచ్చువారు మూడవతెగ. ఈ మూడు తెగలకు సమానమగు హక్కు అనగా లక్షలకొలది కొద్దిపాటి

వారికి నెన్నిసమ్మతులో పదులకొలది బలవంతులకు అన్నిసమ్మతులు ప సాదిత మగుచున్నవి. ద్రవ్యవంతులు బలవత్తములు. మన హైందవభూమివిషయ మాలోచింతము. ఇదివరలో రాష్ట్రీయశాసనసభలకుగాని ఉత్తమశాసనసభకుగాని ప్రజలు ప్రతినిధులను ఎన్నకొనుటయే లేదు. ప్రాతినిధ్యము ద్రావిడప్రాణాయామపద్ధతిని జరుగుచుండినది. జిల్లాబోర్డులకు పురపాలకసంఘములకు సభ్యుల నేర్పరుచు నధికారము సైతము రు 30 ల శిస్తు చెల్లించువారలకే చెందుచుండినది జిల్లాబోర్డులు పురపాలకసంఘములు వీనిసభ్యులకుమాత్రమే శాసనసభలకు సభ్యులను నియమించు నధికార ముండినది. నవీనశాసనము వలన అన్నిసభలకును తిన్నగా ప్రజలు ప్రతినిధులను నియమించు నధికార ముపక్రమింపబడినది. రు ౧౦ లు శిస్తునిచ్చువారు నిర్వాచకాధికార మిప్పుడు పడసినారు.

<u>మానసికగతులు</u>:—మఱి విషయకమైన నమ్మకములు కొన్నియుండిననేకాని నిర్వచనాధికారమునకు మానవుడర్హుడు కాడని కొంతకాల మంగీకృతమయి యుండినది. నేడట్టి నియమ మెచ్చటను లేదు. కాని అమెరికాసంయుక్తరాష్ట్రములలో కొన్నిట నాస్తికులు నిర్వచనాధికారమునకు పాత్రులు కారను నియమ మున్నది. బంధితులైయుండు నేరస్థులును ఉన్మత్తులును పిచ్చివారును ఎల్లరాజ్యములందును అనర్హులుగా పరిగణింపబడుచున్నారు. నేరస్థులు శిక్ష ననుభవించిన యనంతరముగూడ కొంతకాలమో శాశ్వతముగనో యనర్హులుగ

నాలోచింప బడుచున్నారు. నీతిబాహ్యతను సూచించు నేరములు చేసినవారు అనర్హులని నిశ్చయించుటయు కొన్నికొన్ని రాజ్యములలో కానంగ నగును

ఇటీవల నొక క్రొత్తసిద్ధాంతమును బయలుదేరజొచ్చినది. చదువుటకును వ్రాయుటకును రానియట్టివారు నిర్వాచకాధికారమునకు తగియుండరని కొన్నిరాజ్యములు ప్రారంభించినవి. ఈవాదము అమెరికా సంయుక్తరాష్ట్రములలో కొన్నిరాష్ట్రములు మాత్రి మంగీకరించినవి. కారణము సుభలముగా నూహింప తగియున్నది. ఆరాష్ట్రములలోని తెల్లవారికి నీగ్రోలకు తనుతోసమానముగు నంతస్థునుకలుగ జేయుట ఇష్టముగాదు. సంయోగప్రభుత్వమువారి నిబంధనల ననుసరించి రాజ్యములోని పురుషులెల్లరకును సమ్మతినిచ్చు అధికార ముండితీరవలసినదిగానున్నది. కాబట్టి ఈ క్రొత్తదారి త్రొక్కిన యెడల నీగ్రోలు ఎక్కువగా అక్షరజ్ఞులు కాకపోవుటచేత వారిని కొంతవరకు నిరోధింపవచ్చును. ఈవాదమే మన దేశములోను తలచూపుటచదువరులు జ్ఞాపకము చేసికొనగలరు. మనము స్వరాజ్యాందోళనము ప్రారంభముచేసినప్పుడు మన సోదరులగు అధికారవర్గములోని యుత్తములు ఈదేశమున అక్షరజ్ఞులు తగినంతమంది లేరని తీవ్రచర్చల నుపక్రమించిరి. మనవారును ఎంతోతీవ్రముగ నీవిషయమును ఖండించుచుండిరి.

అయిన నిజముగా వోటున కర్హత నియమింప వచ్చునప్పటికి మనయధికారులు విద్యావంతులకు ఎంతవరకు వోటు అధికారము తగ్గించవలయునో అంతయు తగ్గించుటకు ప్రయ

త్నములు చేసినారు. కారణము స్పష్టమే. విద్యావంతులు స్వాతంత్ర్యమును సత్వరముగా కోరుదురు. విషయజ్ఞానముకల వారగుటచేత సత్వరముగా అధికార నైరంకుశ్యమును అణంచివేయ బ్రయత్నింతురు. ఇది యధికారాభిమానులదృష్టి.

ఇంతేకాదు. కొన్నికొన్ని రాజ్యములలో విశేషసూత్రములును గలవు. ఆంగ్లభూమిలో లండను నగరమునందలి పట్టపరీక్షాంచితులు మున్నగువారు సమ్మతు లీయ నర్హులై యుండ దేశముననుండు కొందరుమతాధికారులు మున్నగువారికీస్వాతంత్ర్యము లేదు. మరికొన్ని రాజ్యములలో సైనికవృత్తి యందుండునట్టివారలకు నిర్వాచకాధికారము లేదు. మనదేశములో ప్రభుత్వసేవకుల కీయధికార మీయబడలేదు. కారణము విదితమే. మన కింకను స్వరాజ్యపు వాసనయైనను ప్రసాదితము కాలేదు.

మరియొక విషయము:— నిర్వాచకవర్గమును సంకుచితముచేయు నీకారణములతోగూడ నిర్వాచకులకు తమ యధికారము నుపయోగించుటలో కలుగు నంతరాయములును అనేకములున్నవి. రోగములు బాధలు అనేకులను ఆనాటికి ననర్హుల జేయుచున్నవి మానవునకు స్వభావసిద్ధమగు అలసభావమును ఈవిధమైన ఫలమునే కలిగించుచున్నది. మనదేశములో ఇదివరకుండిన కొద్దిపాటి స్వాతంత్ర్యమును గురించియే యాలోచింతము. జిల్లాబోర్డులు తాలూకాబోర్డులు పట్టణపాలకసంఘములు వీనికి సభ్యులను నియమించునప్పుడుకూడ

సమ్మతులిచ్చుటకు నర్హులగువా రెందరో హాజ రగుచుండ లేదు. నూటికి ఏబదిగురు హాజరయిరని అరువదిగురు హాజరైరని నలువదిగురు హాజరయిరని కార్యనివేదికలలో ప్రకటిత మగుచుండినది. ఇక ముందును అట్టులే జరుగు నెడల ప్రజాప్రభుత్వమనుదాని ఛాయయైనను నుండదనుట నిర్వాచనాధికారము గలవారు జ్ఞాపక ముంచుకొనదగినది.*

నిర్వాచకులు తప్పక సమ్మతు లిచ్చియే తీరవలెనని నిర్బంధించుపద్ధతి యొక్కటి బెల్జియములో ప్రయత్నింపబడినది కాని అది ఫలవంతముకాదు. సమ్మతియిచ్చుటయే స్వాతంత్ర్యము. నిర్బంధముచే స్వాతంత్ర్యమును సాధింపజూచుట పొసగుపని యెన్నడును కాజాలదు.

## నిర్వాచనపద్ధతులు.

నిర్వాచనము ఒక్క సాధారణపద్ధతి ననుసరించి సామాన్యముగా నన్ని దేశములలోను జరుగుచున్నది. ఒక్కొక్క రాష్ట్రమును లేక ప్రదేశమును ఎందరుప్రతినిధులను నిర్వాచింపవలయునో అన్నిమండలములక్రింద విభజింపబడుచున్నది.

* క్రొత్తశాసనసభ లేర్పడునప్పుడు మనదేశములో వానిని బహిష్కరించు నుద్దేశముతో సమ్మతులుంగలవారు సమ్మతు లీయక నిలిచినారు. ఇది సంకల్పముతో చేసినపని. కాబట్టి ఈ వ్రాసినవాక్యము దీని కన్వయింపదు. సంకల్పముతో ఉద్దేశపూర్వకముగా ఒక్కరైనను సమ్మతులీయక నిలుచుట యెల్లరును సమ్మతులిచ్చుటకంటె యెక్కువశక్తిని ప్రదర్శించుట యగును. సమ్మతు లిచ్చుట కుద్దేశింతురేని ఇతరులం దభినివేశము చూపుదు రనుట కిది గొప్ప సూచకము.

ఒక్కొకమండల మొక్కొక ప్రతినిధిని నిర్వాచించుకొను చున్నది. ఈమండలములు జనసంఖ్యనుబట్టియు ఇతరవిధములను ఏర్పడుట కలదు. ఒక్క సభకంటె ఎక్కువసభలకు ప్రతినిధులను పంపవలసిన సందర్భములలో అనగా ప్రజాప్రతినిధిసభ శిష్టసభ లున్నచోటనో క్రిందిదర్జాసభయొకటి పైదర్జాసభయొకటి యున్నచోటనో పైతీరుగా నేర్పడిన మండలములు క్రిందిదర్జాసభకు ప్రతినిధులను నంపగా పైదర్జాసభకు అంతకంటె పెద్దవిభాగములు ప్రతినిధులను నెన్నుకొనుచున్నవి. ఫరాసుభూమిలో ప్రజాప్రతినిధిసభకు చిన్నమండలములు ప్రతినిధుల నేరుకొనును. డిపార్టుమెంటు లను అట్టిమండలముల చేరికలు శిష్టసభకు సభ్యులను నిర్వాచించును.

పైతీరుగ నిర్వాచనములు జరుగునప్పుడు ఎవ్వరికి ఎక్కువసమ్మతులు (వోట్లు)దొరకునో అతడుప్రతినిధిగా నిర్వాచితుడైనట్లు అంగీకరించుట యాచారము. ఒక్కసమ్మతి ఎక్కువగా వచ్చినను వచ్చినట్లే. ఇన్నిసమ్మతులు ఎక్కువగా వచ్చితీరవలయునను నిశ్చయము ఎక్కడను లేదు.

ఈనిర్వాచనపద్ధతి చాల యక్రమమని అనేకులు ఖండించి క్రొత్తపద్ధతులను వెదుక జూచినారు. ఏల యక్రమమనినారో ఆలోచించి ఇతరపద్ధతు లేమి యవలంబింపబడినవో చూతము. ఒక్కమండలమున ౧౦,౦౦౦ ప్రజ నిర్వాచకు లున్నా రనుకొందము. అభ్యర్థి వెంకయ్యకు ౫౦౦౧ గురు తమ సమ్మతుల నిచ్చుచున్నారు. అప్పుడు ౪౯౯౯గురు యభ్యి

ఁ్రియములకు విలువ లేకపోవుచున్నది. అంతేకాదు. నిజ
ుగా రాష్ట్రమునం దెల్లజనులను తీసికొనినచో తక్కువపలు
బడి కల కక్షివారు కొద్దిపాటిబలమును అనేకమండలము
లో చూపి కొన్నిమండలములలో బలమే లేకున్నను జయింప
చ్చును. రాష్ట్రములో ౫౦౦ మండలము లున్నవి యనుకొం
ము. ఒకకక్షివారికి ౨౬౦ మండలములలో ౧౦,౦౦౦౦౦ల
మ్మతులు దొరకుచున్నవి. ఎదుటివారికి ౭,౫౦,౦౦౦ల
మ్మతులు దొరకుచున్నవి. ఆకక్షికి అందువలన ౨౬౦
ండలములనుండి ప్రతినిధు లేర్పడినారు. తక్కిన ౨౪౦
ండలములలో ఆకక్షికి ౨,౫౦,౦౦౦ సమ్మతులే వచ్చిన
నుకొందము. ఎదుటికక్షికి ౧,౫౦౦,౦౦౦ వచ్చినదనుకొం
ము. ౨౬౦ మండలములలో కొంచెమెక్కువగా పలుకు
డి గలవారు తమకు ౧౨, ౫౦,౦౦౦ సమ్మతులే వచ్చినను
ప్రతినిధులసంఖ్య తమకు ఎక్కువయగుటచేత అధికారమునకు
త్తురు. కొన్నిమండలములలో మిక్కుటముగా పలుకుబడి కల
ారును అన్నిమండలములలో రమారమి సమానమైన
లుకుబడి కలవారును నైన ఎదుటికక్షవారు మొత్తము
౨ ౨,౫౦,౦౦౦లసమ్మతులు కలవారయ్యును అధికారమునకు
ాలేని వా రగుచున్నారు.

<u>క్రొత్తపద్ధతులు:</u>—ఈవిధమైన నిర్వాచనవిధానము
ందు కల లోపములు రాజకీయవేత్తలు గ్రహించియుండియు
ూడ ప్రత్యామ్నాయపద్ధతులు కొన్ని యేర్పడియు ఈసామా

న్యపద్ధతికి మాత్ర మింకను చలనము కలుగలేదు. క్రొత్తగా నుపక్రమితములైన ప్రత్యామ్నాయపద్ధతులను రెండుజాతులుగా విభజింపవచ్చును. ఏయేకక్షిలో ఎందరెందరు నిర్వాచకు లేర్పడుదురో వారివారి సంఖ్యల కనుగుణముగా ప్రతినిధులను నేర్పరచుకొను నధికార మిచ్చు నుద్దేశముతో ప్రారంభింపబడిన పద్ధతులు కొన్ని కలవు. సంఖ్య కనుగుణమైనను కాకున్నను తక్కువసంఖ్యాకుల యభిప్రాయము నేదో యొకకొంతయైనను బయలుపెట్టుటకు తగిన యవకాశము లీయవలయు నను నుద్దేశముతో నేర్పడిన పద్ధతులు మరికొన్ని కలవు. మొదటితెగపద్ధతులకు సంఖ్యానుగుణపద్ధతు లని రెండవతెగపద్ధతులకు స్వల్పసంఖ్యప్రాతినిధ్యపద్ధతు లని వ్యవహార మున్నది.

సంఖ్యానుగుణప్రాతినిధ్యమో స్వల్పసంఖ్యప్రాతినిధ్యమో అవసర మగునెడల ఏమండలమునకును ఒక్కప్రతినిధి మాత్రమె యుండరాదు. ఇద్దరున్నను ఈ రెండుపద్ధతులను పాసకుననుకొనుటకు వీలులేదు. అంతకంటె నెక్కువయైనసంఖ్యయే యుండి తీరవలసి వచ్చుచున్నది. ఇప్పుడు ప్రజాప్రభుత్వమేర్పడియుండు రాష్ట్రము లన్నిటిలోను మండలమున కొక్క ప్రతినిధికంటె నెక్కువగా నిచ్చినయెడల రాజ్యాంగసభలు మిక్కిలి యెక్కువ సాముదాయకము లయిపోయి పనిజరుగుట కష్టమగును. కాబట్టి చేయవలసిన యుపాయ మొక్కటే కలదు. మూడేసిమండలముల నొక్కటిగా కలుపవలసి యుండును. అట్టికలయిక ప్రాతినిధ్యప్రభుత్వపు గుణమునే చెరుపు

వనుట నిజము. అభ్యర్థిగానుండువాని గుణశీలములు నిర్వాచకులకు తెలియుట కష్టముకాక తప్పదు. మండలము చిన్నదైనయెడల నిర్వాచకుడు తనప్రతినిధినిగురించి యెఱింగికొనుటకు ఎక్కువ యవకాశము లుండును.

<u>సంఖ్యానుగుణప్రాతినిధ్యము:</u>— సంఖ్యానుగుణ ప్రాతినిధ్యపద్ధతులలో మొట్టమొదటిది ఇది. మండలములోని ఒక్కొక్కశక్తియు ఎందరుసభ్యులు కావలసి యున్నారో అందరిని పేర్కొనవచ్చును. ప్రతినిర్వాచకుడును ఎందరు సభ్యులు కావలయునో అన్నిపేళ్ళను అంగీకరింప వచ్చును. కాని ఆయంగీకార మిచ్చుటలో ఒక్కరికి ఒక్కయంగీకారమునకంటె నెక్కువ యీయరాదు. ఒక్కొక్కసమ్మతియు అభ్యర్థి ననుసరించియు, అభ్యర్థి శక్తి ననుసరించియు లెక్కింపబడుచున్నది. ఏయే శక్తియభ్యర్థులకు మొత్తమెన్నియెన్ని సమకూరుచున్నవో వాని ననుసరించి ఆదామాషనుబట్టి సభ్యులను నిర్ణయించి ఆశక్తియభ్యర్థులలో తదుచితసంఖ్యలు వచ్చినవారు నిర్వాచితులయినట్లు తీర్మానించుచున్నారు.

ఉదాహరణము: ఒకమండలమున ౧౦,౦౦౦ నిర్వాచకుల సంఖ్యకలదు. ఆర్గురు ప్రతినిధులు నిర్వాచితులు కావలసియున్నారు. మూడు శక్తులున్నవి—భారతశక్తి, భాగవతశక్తి, రామాయణశక్తి. ఈమూడు శక్తులవారును ఆర్గురార్గురభ్యర్థులను పేర్కొనుచున్నారు. ఒక్కొక్కనిర్వాచకుడును ఆరు సమ్మతుల నిచ్చుచున్నాడు. మొత్తము ౬౦,౦౦౦

సమ్మతులైనవి. లెక్కవేయగా భారతకక్షికి ౩౦,౦౦౦ సమ్మతులు సమకూరినవి. భాగవతకక్షికి ౨౦,౦౦౦ సమకూరినవి. రామాయణకక్షికి ౧౦,౦౦౦ లే సమకూరినవి. అప్పుడు ఆర్గురిలో భారతకక్షిప్రతినిధులు ముగ్గురు; భాగవతకక్షిప్రతినిధులు ఇరువురు; రామాయణకక్షిప్రతినిధి ఒక్కడు ఏర్పడవలెననుట స్వయంప్రకాశము. తీర్మానమీక్రింది పథకమున చూడనగును.

| భారత | భాగవత | రామాయణ |
|---|---|---|
| అ గారు ౬,౦౦౦ | ఎ గారు ౩,౭౦౦ | క గారు ౨,౪౦౦ |
| ఆ గారు ౫,౭౫౦ | ఏ గారు ౩,౯౦౦ | ఖ గారు ౨,౨౦౦ |
| ఇ గారు ౫,౦౦౦ | ఒ గారు ౩,౬౫౦ | చ గారు ౧,౪౦౦ |
| ఈ గారు ౪,౬౦౦ | ఓ గారు ౩,౪౦౦ | జ గారు ౧,౩౫౦ |
| ఉ గారు ౪,౩౫౦ | అం గారు ౨,౭౦౦ | ట గారు ౧,౩౫౦ |
| ఊ గారు ౪,౨౦౦ | అః గారు ౨,౬౫౦ | డ గారు ౧,౩౦౦ |
| ౩౦,౦౦౦ | ౨౦,౦౦౦ | ౧౦,౦౦౦ |
| అధికారార్హులు<br>అ<br>ఆ<br>ఇ | అధికారార్హులు<br>ఎ<br>ఏ | అధికారార్హుడు<br>క. గారు. |

పైవిధానము ౧౮౭౦ వ సంవత్సరమున శాసనసభ్యుల నెన్నుకొనుటయందు క్ర్యూబాలో అమలులో పెట్టబడెను. నేటిదినము ఇది అనేకవిధములగు సభ్యులను నిర్వచించు

కొనుటకు నార్వేలోను, స్వీడనులోను, ఎక్కువగా స్విట్జరులాండులోను ఉపయోగపడుచున్నది. దీనివలన అనేకలాభము లున్నవి కావున నీవిధానమును అనుకరింప రాదా యని ఫ్రాన్సు, ఇంగ్లాండు, హాలండు దేశములవారు విమర్శలు చేసియున్నారు. బెల్జియము, జపానులలో ఈపద్ధతియొక్క యనుకరణము లోకకొన్ని పనిచేయుచున్నవి. అమెరికా సంయుక్త రాష్ట్రములయందును ఈపద్ధతి విమర్శయందున్నది. మనదేశములో ఇంకను స్వరాజ్యపుపోకడలు లేవు. సంఖ్యానుగుణనిర్వాచనపద్ధతుల కెడము లేదుకాని ఇటీవల కొన్నిప్రాంతములలో బయలుదేరిన బ్రాహ్మణేతరసమస్య తీర్మానించుటకు ఈపద్ధతికి కొంచెము పోలికగల పద్ధతియొకటి సలహా చేయబడియున్నది. అందులో సంఖ్యానుగుణప్రాధాన్యము లేదు. కాని యొకపక్షమువారిని తృప్తిపరచుటకుగాను వరుసతప్పించి యిచ్చుటమాత్రము అంగీకృతమైనది. పద్ధతి ఇది: ఒక్కమండలమున ముగ్గురు ప్రతినిధులేర్పడవలెను. బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు అభ్యర్థులుగా నున్నారు. మొదటిముగ్గురిలో బ్రాహ్మణుడొక్కడుండెనా అతడు నిర్వాచితుడగుచున్నాడు. తక్కుంగలవారొక్కడు బ్రాహ్మణుడైనను ఇరువురు బ్రాహ్మణులైనను వారిపేళ్ళు త్రోసివేయ వలసినది. మొదటి ముగ్గురలో బ్రాహ్మణుడు లేడా బ్రాహ్మణులకు నిర్వాచనము లేనేలేదు. బ్రాహ్మణేతరులను మాత్రమే గణింపవలసినది. సమ్మతుల ననుసరించి వారికి సభ్యత్వ మేర్పడవలసినది. ఇది లోకమున మరి మెచ్చటను లేనిపద్ధతి. బ్రాహ్మణేతరులైన బహుసంఖ్యాకుల

కిట్టి సంరక్షణ యవసర ముండరాదు. కాని సంపూర్ణ ప్రజ ప్రభుత్వము లేనందుచేతను నిరంకుశాధికారవర్గము వెలసినంత కాలము విద్యావంతు లగుట కవకాశము కల తెగవారు నిరంకుశులుగా నుండుట కనుకూల ముండుటచేతను ఈ విధానము కొంత కాల మంగీకృతము కావచ్చును. తుదకు రద్దుగాక తీరదు.

సంఖ్యానుగుణప్రాతినిధ్యపద్ధతిలో రెండవవిధానము హేరు అనునాతఁ డుపక్రమించినది పైనచెప్పిన ౧౦,౦౦౦ మండలమునే ఉదాహరణముగా దీసికొందము. ఆర్గురుప్రతినిధులు నిర్వాచితులు కావలసి యున్నా రనుకొందము. పదివేల నిర్వాచకులును "మాయిష్టమునం దీతడు ప్రథమగణ్యుడు, ఈతడు ద్వితీయగణ్యుడు"అని సూచించుచు ఆర్గురను క్రమముప్రకారము వ్రాయుదురు. ౧౦,౦౦౦ సమ్మతులు ఆర్గురుప్రతినిధులు నగుటచేత ఇందులో ఆరవవంతును కొంచెము పైగా మొదటిస్థానమున నుండునట్టివాడు తప్పక నిర్వాచితుడు కాగలడు. అందుచేత ౧౦౦౦౦/౬ అనగా ౧౬౬౬కు పైబడి ౧౬౬౭ సమ్మతులు రాగానే అట్టివాడు నియమితుడై పోవుచున్నాడు. అతనికి కల్గిన మిగతసమ్మతులు అతనితో రెండవవాడుగా పేర్కొనబడినవానికి మార్చబడుచున్నది. రెండవవాడును మరల మొదటివానిరీతినియే నియమితు డగుచున్నాడు. ఇట్లు నియమించుటలో ఐదుగురకుమాత్రమే ౧౬౬౭సమ్మతులు దొరకిన వనుకొందము. ఆరవవానిని నియమించు విధానమేమి? అందరికంటె తక్కువసమ్మతులు సంపాదించినవానిని పట్టికనుండి

తొలగించి అతనికివచ్చిన మొదటిపదవి సమ్మతులసంఖ్యను రెండవవానికి మార్చుచుపోవలెను. ఆతీరుగా నెవ్వరికి ౧౬౬౭ సమ్మతులు కలుగునో అతడు నియమితుడగును. ఈపద్ధతి పెద్దపెద్దసంఖ్యలుగల ప్రజ లుండుచోట కార్యక్రమమున నిడుటకు రాదు. దీనిని వ్యవహారములో సాగించుట మిక్కిలి కష్టము. కాబట్టి యిది డెన్మార్కు దేశమున మాత్రమొకప్పుడు ప్రచారములోనికి వచ్చెను గాని మరియెచ్చటను దీనికి వ్యాప్తి కలుగలేదు. టాస్మేనియా, ఫిన్లండు, మొరేవియాలలోను, ఐర్లాండులోను దీనిని కొంతవరకు ఉపయోగించుచున్నారని తెలియుచున్నది.

స్వల్పసంఖ్యాప్రాతినిధ్యము:—స్వల్పసంఖ్యాప్రాతినిధ్య విధానములును కొన్నిచోట్ల నవలంబింపబడినవి. ఇందులో మొదటిదానిని మితసమ్మతివిధాన మనవచ్చును. ప్రతినిర్వాచకుడును ప్రతినిధులసంఖ్య యెంతకావలయునో అందరకు సమ్మతులిచ్చుటకు అధికారము కలవాడు కాడు. ఆసంఖ్యకంటె కొంచెము తక్కువగానే అతడు సమ్మతు లీయవలసి యుండును.

ఉదాహరణము: ౧౦,౦౦౦ సమ్మతుల మండలమునే తీసికొందము. ఆర్గురు ప్రతినిధులు కావలసి యున్నా రనుకొందము. అప్పుడు ప్రతినిర్వాచకుడును అభ్యర్థులలో నుండి నలుగురినే యెన్నుకొనవలసియుండును. స్వల్పసంఖ్యాకమగు 'కక్షి' చక్కగా ఏర్పాటులుచేసికొని తమకుసంబం

ధించిననిర్వాచకులందరును తమచే పేర్కొనబడిన ఇరువురికే సమ్మతు లిచ్చునట్లు గిట్టము చేసికొనినయెడల తప్పక వారి కిద్దరు ప్రతినిధు లేర్పడుదురు. ఎక్కువ బలవంతమగు "కక్షి" సమ్మతులు తక్కిన నలుగురకు విభాగితమైపోవును. స్వల్ప సంఖ్యాకమగు 'కక్షి' ఒక్కటేయుండి తగినంత జాగ్రత్తగా నున్నయెడల ఈపద్ధతి అక్కరకువచ్చును. అట్టికక్షులు రెండు మూడుండుట తటస్థించునేని ఏమాత్రము జాగ్రత్తలోపము కలుగునేని ఈపద్ధతి పనికిరాదు. ఈపద్ధతిని ఇటలీ, స్పెయిను, పోర్చుగలు రాజ్యము లుపక్రమించి కొంత ఫలము గాంచి నవి. అమెరికాసంయుక్తరాష్ట్రములలో 'మాసచుసెట్సు' 'పెన్సిలువేనియా' అను రాష్ట్రములలో నీపద్ధతి కొంతప్రచార మందున్నది.

స్వల్పసంఖ్యప్రాతినిధ్యము విషయమున నుపక్రమింత మైన రెండవవిధాన మొకటి కలదు. ఇందులో ప్రతినిర్వాచ కునకును ప్రతినిధులసంఖ్య యెంతకావలయునో అన్నిసమ్మ తులును ఇచ్చు నధికారము కలదు. ఈఅధికారము నతడు ఇచ్చవచ్చినరీతిని వినియోగింపవచ్చును. అన్నిసమ్మతులను ఒక్కఅభ్యర్థికే యిచ్చుకొనవచ్చును. కొందరకు పంచిపెట్ట వచ్చును. అందర కొక్కొక్కటిగా నీయవచ్చును.

ఈపద్ధతి చక్కగా పనిచేయవలయుననినను "కక్షులు" మిక్కిలి జాగ్రత్తగా చురుకుగా కార్యాలోచన చేయవలసి యుండును. లేనిచో ప్రజారంజకుడగునభ్యర్థికి సమ్మతులన్నియు

గుమిగూడిపోయి అదేకక్షిలోని రెండవవానికి గతిలేక పోవచ్చును. సమ్మతులు వ్యర్థమైపోవచ్చును.

ఈ "ఇష్టానుసారసమ్మతి" విధానము అమెరికాసంయుక్త రాష్ట్రములకుచెందిన "ఇల్లినాయి" రాష్ట్రములో చక్కగా ఉపయోగపడినది. స్వల్పసంఖ్యాకమగు "కక్షి" కి ప్రతిమండలములోను అధమపక్షమొక్కప్రతినిధియైనను నేర్పడినాడు. బహుసంఖ్యాక "కక్షి" మేల్కొని పనిచేయని తరుణములలో స్వల్పసంఖ్యాక "కక్షి" కి నెక్కువప్రతినిధులు లభించినదియు కలదు.

<u>నేటిపద్ధతియే మేలు:</u>— సంఖ్యానుగుణప్రాతినిధ్యమో స్వల్పసంఖ్యప్రాతినిధ్యమో ఇప్పటిప్రాతినిధ్యపద్ధతికంటె న్యాయతరమనుటకు సందియములేదు. సంఖ్యానుగుణప్రాతినిధ్యము అనుసరణీయమనుట ఎట్టివారికిని తోచకపోదు. కాని నేటిసామాన్యపద్ధతి ప్రచారములో నుండుటకు కారణమేమో కొంత యాలోచింపదగియున్నది. ఒక్కమండలములో నొక "కక్షి" బలవంతము గాకున్నను మరియొకమండలిలో నది బలవంతముగా నుండుట తప్పదు. కాబట్టి ఒక్కచోట స్వల్పసంఖ్యాకమైన "కక్షి"కి మరియొక్కచోట బహుసంఖ్యాకత్వముండుటచేత అచ్చట ప్రాతినిధ్యము దొరకుచునే యున్నది. అందుచేత స్వల్పసంఖ్యప్రాతినిధ్యముకూడ నొకరీతిని నేటిపద్ధతియందు సమకూరుచునే యున్నది. మరియు అనేకవిధములైన యభిప్రాయములవారు చిల్లరమల్లరగా ప్రభుత్వనిర్వాహణ

మున చేరుదురేని ఎవ్వరికిని నోరులేనిస్థితి యేర్పడి కార్యనిర్వహణము ఉత్సాహముతో జరుగుట కవకాశ ముండదు. జరిగిన కార్యవిమర్శయు ఏకముఖముగా నుండకపోవుటచేత ముందుకు మార్గదర్శకమును కాజాలదు. నేటి సామాన్యపద్ధతి యందన్ననో ఏదోయొక 'కక్షి' బలవత్తమముగానుండి స్వతంత్రముగా సాహసముతో పనిజరుపుట కవకాశ మున్నది. ఎదుటి 'కక్షి'వారి విమర్శయు తదనుగుణమై తీక్ష్ణముగానే ఉండుచున్నది. తీక్ష్ణవిమర్శఫలము ప్రజలలో ప్రతిఫలించి తమకుస్థానభ్రష్టత్వ మెక్కడ కలుగునోగదాయని అధికారములోనుండు 'కక్షి'వారు జాగ్రత్తగా నుండవలసియున్నారు.

ఇంతియకాదు. నేటిపద్ధతిమూలకముగా మరికొన్ని రాజకీయాచారము లేర్పడియున్నవి. స్థానికస్వపరిపాలనమనునది మొదటిమెట్టుగా నంగీకృత మగుచున్నది. కాబట్టి స్థానికవిషయములలో ఆయాప్రాంతములలో నే 'కక్షి'కి పలుకుబడికలదు. ఆ 'కక్షి'యే—రాష్ట్రములో స్వల్పసంఖ్యాకమగు 'కక్షి'గా నున్నను—కార్యనిర్వహణాధికారిగా నుండగలదు. ఆయాప్రాంతములలో అధికారులను నిర్వచించు నేర్పాటులును ఈఫలమునే సమకూర్చుచుండును.

ఈకారణము లన్నిటిమూలకముగా నేటి సామాన్యపద్ధతియే యెల్లరాష్ట్రములచేతను ఆమోదితమై యున్నది.

## నిర్వాచకుల యాజమాన్యము.

ఇదివరకుసూచింపబడిన పరిస్థితులకు లోబడి లోకములోని రాజ్యములయందు నిర్వాచకవర్గము లేర్పడి యున్నవి. అయిన రాజ్యాంగములపై ఈ నిర్వాచకవర్గములకు గల యధికారము సర్వత్ర ఒకేవిధమైనది గాదు. కొన్ని రాజ్యములలో రాజ్యాంగనిర్మాణమున మార్పులుచేయునధికారము ప్రజలకు మాత్రమేకలదు. అట్టిచోట్ల ప్రజలేమిచేయుచున్నారో యాలోచింపుడు. ప్రభుత్వమువారు ఇట్టిఇట్టి కార్యములు చేయరాదని నిషేధించుచున్నారు. ఈనిషేధాధికారమే మొట్టమొదట ప్రజలకు జిక్కినట్టియధికారమని చరిత్రవలన తెలియుచున్నది. నిరంకుశాధికారులు ఇచ్ఛకువచ్చినట్లు కార్యములు జరుపుకొని పోవుచుందురు. "మీరు మా కక్కరలేదు, మేమే మాకార్యములను చేసికొందుము" అనునట్టి మాటలు బహుసంఖ్యాకమగుప్రజ వెంటనే చెప్పజాలదు. కాని నిరంకుశప్రభుత్వము యొక్క బాధను మాత్రము తప్పించుకొనుటకు ప్రబలమైన ప్రయత్నములు చేయక తీరదు. సరియైనవిచారణ న్యాయస్థానములలో బహిరంగముగా జరుపక రాజు ఎవ్వరికిని శిక్ష విధింపరాదు అనికోరుటయు, ప్రజలకు తెలిపి ప్రజలు విమర్శించుటకు అవకాశ మిచ్చినతరువాతనేగాని రాజు క్రొత్తపన్నులు విధింపరాదని కోరుటయు, మొదలగు నాందోళనలు ప్రజాప్రభుత్వ మంకురించునప్పుడు ఎల్లరాజ్యములలోను పొడసూపుచున్నవి. రాజ్యకార్యనిర్వహణమున తాము జోక్యముకలుగజేసికొనుటకుముందు ప్రజలు నిరకుంశప్రభుత్వముల నిరంకు

శత్వమును మట్టుపెట్టుట యెట్లాయని యాలోచింపవలసి వచ్చుచున్నది. మిక్కిలి పురాతనకాలములనుండియే యీ ప్రయత్నము జరుగుచు వచ్చియున్నది. ఆంగ్లభూమిలో "జాన్" అనురాజు ౧౨౧౫ వ సంవత్సరమున ప్రసాదించిన వరదానపత్రమును మనరాజ్యమునకు ౧౮౫౮ లో విక్టోరియామహారాజ్ఞి ప్రసాదించిన వరదానపత్రమును ఈవిధమగు ప్రజాశక్తికి తార్కాణములు. మన కిప్పుడు ప్రభుత్వమునకు చెందిన రాజ్యాంగనిర్మాణమునందు మార్పులుచేయు నధికారము లేదు. బహుకాలమువరకు అట్టియధికారము లభించునని యెదురుచూచుటకును వీలులేదు. కాబట్టి మన దేశీయ మహాసభవారు ఢిల్లీలో సమావేశమయిన యప్పుడేమి అమృతసరసులో సమావేశమయిన యప్పుడేమి రాజకీయసంస్కరణములకు ముందుగా స్వాతంత్ర్యవరదానశాసన మొకటి యుపక్రమింపవలసినదని కోరిరి. క్రొత్తగా నేర్పడినశాసనము చిత్తులో నున్నప్పుడు అందులోనే హైందవవ్యక్తిస్వాతంత్ర్యములను సంరక్షించు నేర్పాటులు ప్రప్రథమమున చేయవలసినదని అర్థించినారు. బహిరంగముగా సాక్ష్యము మొదలయినవి విచారించి న్యాయస్థానములలోని యధికారులు శిక్షించిననేగాని అధికారవర్గములోనివారు ఎవ్వరిని నిర్బంధింపరాదనియు, అధికారవర్గములోనివారు ధరావత్తులు మొదలైనవి కోరుటచేతను ఇతరవిధములను అభిప్రాయ ప్రకటనమును నిరోధించు స్వాతంత్ర్యము కలవారుగా నుండరాదనియు మొదలైన వెన్నియో ఈశాసనమున చేర్చవలసినట్లుగా మన నాయ

లైనవారు విశ్వప్రయత్నములు చేసిరి. దేశరక్షక శాసనము, ముద్రణాయంత్రశాసనము* రౌలట్టుశాసనము ఇత్యాది రోధకశాసనముల నిరంకుశత్వమును సమయించుట కిదియే మాధారమని యెంతదూరమో పోరినారు. కాని ఈపోరంతయు నిష్ఫలమైనది. ఇదియెట్లున్నను ప్రజలు గడింపజూచు మొదటి శక్తి కార్యనిర్వాహణశక్తికంటె నెక్కువగా కార్యనిషేధకశక్తి యనుట యిందువలన తెల్లమగుచున్నది.

ప్రభుత్వాధికారులను నియమించునధికారము నిర్వాచకవర్గమునకు కలదా? వారు చేయునట్టి కార్యములను నడుపుటయందును నిరోధించుటయందును నిర్వాచకవర్గమున కెంతవరకు పలుకుబడి యున్నది? అను నీరెండుప్రశ్నలపై నిర్వాచకవర్గముయొక్క నిజమైన అధికారము ఆధారపడియున్నది.

<u>ప్రాచీనకాలము:</u>— ప్రాచీనకాలములలోను ఈరహస్యము గ్రహింపబడి యుండినది. పౌరులెల్లరును నొక్కచోట జేరి తమశక్తిని అమలులో పెట్టుచుండుట అప్పుడు కొన్నియెడల నాచారము. గ్రీకు 'ఎక్లీషియా'లో నీరీతి నందరును చేరుచుండిరి. ప్రతిసభ్యునకును విమర్శనాధికార ముండినది. ఎక్కువసంఖ్యాకులు చెప్పినమాట జరుగుచుండినది. కొంత గందరగోళముకూడ నుండినదనినను తప్పుగాదు. అదే రోమక

*ఈ దిన మిది బ్రిటిషుపరగణాలకు సంబంధించినంతవరకు రద్దయినది స్వదేశసంస్థానాధీశ్వరుల సంరక్షణకొరకని అధికారులు దీనిని ఇంకొకరూపమున పునరుజ్జీవింపజేసినారు.

సామ్రాజ్యములోని సంగతి చూడుడు. అచ్చట ప్రజావర్గము తరగతులక్రింద విభజింపబడి యుండినది. ఒక్కొకవిభాగము నకును 'మేజిస్ట్రేట' ను పేరితో నొక యధికారి యేర్పడియుండి నాడు. అతనియాజమాన్యమున ప్రజాభిప్రాయప్రకటనము జరుగుచుండినది. ఈ రోమకసామ్రాజ్యముగాని ఆ గ్రీసు పట్టణరాజ్యములుగాని తలచూపుట కెంతోకాలము ముందు మన రామాయణకాలములో పౌరులందరును చేరి రాజులకు సలహాలిచ్చి తరువాత రాదగిన రాజులనుకూడ తమ ఇష్టము ప్రకారమే నిర్ణయింపించుచు వచ్చినారు. అయిన నిచ్చట సామాన్యముగా సభకు రాజు అధ్యక్షుడుగా నుండుచు వచ్చినాడు. అనుభవవంతులును త్యాగశీలురును సామాన్యలోకాతీతులును నైన ఋషివరేణ్యులు మంత్రోపదేశము చేయుచుండి నారు.

<u>పాశ్చాత్యచరిత్ర</u>:—పాశ్చాత్యదేశములలో జరిగిన క్రిమ మనుసరింతము. ఇదివరలో చెప్పినరీతిని రాజ్యము విస్తారతరమై ప్రజాబాహుళ్యము తటస్థించినకొలదిని పౌరులందరును రాజకీయాధికారమును నేరుగా వినియోగింప నలవి కాదు. అర్హత గలవారలలో బహుస్వల్పసంఖ్యాకులే సమావేశములకు హాజరగుట సంభవించుచున్నది. ఎక్కువసంఖ్యలు చేరుదురా ఏపనియు జరుగుట సంభవింపదు. సరియైనయాలోచన చేయుటయేని పొసగదు. నేటి ప్రజాప్రభుత్వములు ఈకష్టమును నివారించుకొనినవి. ప్రతినిధుల నేర్పరచి వారిచే శాసనములు చేయించుచున్నవి. వారిమూలకముగానే అధికారు

లను నియమించి ఆవిధముగా ప్రభుత్వమును ప్రజలవశము చేయుచున్నవి. నిర్వచనము, ప్రాతినిధ్యము అను నీరెండు సాధనముల మూలకముగా నేడు ప్రజాపరిపాలితరాష్ట్రముల లోని ప్రజలు ఇతర ప్రభుత్వసంస్థలపై అధికార ముంచుకొని యున్నారు. ఇంతియకాదు. మరియొక విధముగాగూడ ప్రజలు తమ ప్రభుత్వాధికారిమును వశపరచుకొని యున్నారు. రాజ్య ప్రభుత్వ మొకకొన్ని యధికారములను నిర్వహించుచుండగా స్థానిక ప్రభుత్వములు మరికొన్ని యధికారములను నిర్వహించు చున్నవి. ఈస్థానిక ప్రభుత్వము అనునట్టిది రాజ్యప్రభుత్వము రాష్ట్రప్రభుత్వములకంటె మిక్కిలి తిన్నగా ప్రజాధీన మైనది. ఆయాప్రాంతముల ప్రజలు తమకు పరిసరవర్తులగువారిని ప్రతినిధులుగా నెన్నుకొని వారిచేత ననేక కార్యములను తమ యెదుటనే చేయించుకొనుచున్నారు. కాబట్టి శాసనకర్తలగు ప్రతినిధులు, స్థానిక కార్యనిర్వాహకులగు ప్రతినిధులు, ప్రభు త్వోద్యోగులు నను నీసాధనముల యుపయోగమును నిర్వ చనమను మహాశక్తిచే నిర్మించి ప్రజాప్రభుత్వములు తమ యధికారమును నడుపుకొనుచున్నవి.

<u>ప్రతినిధులు-ప్రజాభిప్రాయము</u>:—శాసనకర్తలగు ప్ర నిధులు ప్రజాభిప్రాయపూర్ణత్వమును ప్రదర్శింపక పోవుట గలదు. అందుకు ననేక కారణము లున్నవి. శాసననిర్మా సభలలో ననేక ప్రాంతములయందు వంశపరంపరాగతము సభ్యులగువార లింకను నున్నారు. ఆంగ్లసీమలోని ప్రభు

సభ యంతయు కొంచెమించుమించుగ నిట్టిసభ్యులతో నిండియుండునదే. అధికారవర్గములోని వారలు ప్రభుత్వమువారిచే శాసనసభలకు నియమితులగుటయును కొన్ని రాజ్యములలో ఆచారము. ప్రజాప్రభుత్వము మన కెక్కడికి నలవడ లేదుగాని శాసనసభ లేర్పడియుండునంతవరకు అందులో నీ ఛాయ మాత్రము తప్పలేదు. క్రొత్తగా మహౌదార్యముతో ప్రసాదింపబడిన శాసనసభలలో సముచితము రమారమి యైదవ వంతువరకును ప్రభుత్వాధికారులచే నియమితులగు ప్రతినిధులు గలరు. నియమితులైనవారు మాత్రమే కాదు. కొన్ని రాజ్యములలో ప్రజలచే నెన్నగా నేర్పరుచుకొనబడక ద్రావిడ ప్రాణాయామముగా శాసనసభలలో ప్రవేశించినవారును గలరు. ప్రజానిర్వాచనము లేనికాలము ననే ప్రజానిర్వాచనయుగమునకు ముందే ఈద్రావిడప్రాణాయామము మనకు పద్ధతిగా నేర్పడినది. దానివివర మిదివరలోనే ఇచ్చియున్నాము. ఈపద్ధతి ప్రజాభిప్రాయములను నేరుగా తెలుపగలది కాదనుటకు మనదేశములో నిప్పుడు కలిగియుండు మార్పే కొంతవరకు తార్కాణము. ఇవియన్నిటితో సమానమైనది ఇంకొక్కటికూడ ప్రజాభిప్రాయనిరోధకశక్తి కొన్ని కొన్ని రాజ్యములలో కానవగును. ప్రజాప్రతినిధిగా నియమితుడైనశాసనాధికారి తానధికారమునందున్నంతకాలము తన యభిప్రాయ మెట్టిదియైనను ప్రజాభిప్రాయానుసారముగనే తన యభిప్రాయ మియ్యవలసినదను నిర్బంధ మన్నిచోట్లను లేదు. ప్రజ లొక్కయభిప్రాయ మిచ్చుచుండగ తా నొక్క యభి

ప్రాయమును స్వతంత్రముగా చెప్పుచుండవచ్చు నను న్యాయ
ము ననుసరించు ప్రతినిధు లెందరో లోకమున నున్నారు. అది
యు ప్రతినిధిధర్మ మని తలంచువారును గలరు. నేటిపరిస్థితు
లలో మన మితవాదసోదరులస్థితి ఇచ్చట సంస్మరణీయము.
దేశములో నెక్కువమంది యభిప్రాయము తమయభిప్రాయము
నకు భిన్నమని వా రంగీకరించెదరు. తాము దేశముయొక్క ప్రతి
నిధుల మని చెప్పుకొనుటకు వారు వెనుదీయరు. తామిచ్చునభి
ప్రాయము తమయభిప్రాయమున దేశోపకారికాబట్టి యంగీకా
రార్హమందురు. ప్రజాప్రభుత్వములుగల స్థానములయందు ప్రతి
నిధులయధికారమునకుగల కాలపరిమితి కొంతవరకు ఇందుకు
ప్రతీకారముగా పనిచేయుచున్నది. మరలమరల ప్రజాప్రతినిధి
గానుండి సేవచేయవలయుననియు కీర్తి పొందవలయుననియు
మానవునకు ఆశ లుండక మానవు. ఏయేరాజ్యములలో అధి
కారకాలపరిమితి తక్కువగా నుండునో ఆయారాజ్యములలో
ప్రతినిధులు ప్రజాభిప్రాయమును అనుసరింపక తప్పదు. నేడు
తాను ప్రజాభిప్రాయమునకు భిన్నమగు నభిప్రాయముతో
ప్రవర్తించినయెడల మరల రేపు ప్రజలయెదుట నిలిచి అభ్య
ర్థిగా వేడుకొనుట పొసగదే యను భయము వారిని వ
స్థాయైనమార్గమున ప్రవర్తింప జేయుచుండును. బహుకాలము
వరకు ప్రతినిధులకు అధికారము నిలచు భూములలోన
ఒక్కపరి నియమితుడైనచో శాశ్వతపట్టముగా ననుభవిం
వచ్చునను నమ్మకము ప్రతినిధికి కలుగునట్టి రాజ్యములలో గ

'తిరిగిరా' పద్ధతి:— కాబట్టి కొన్నికొన్ని దేశములలో ప్రజలు ఇంకొక క్రొత్త యుపాయమును వెదకి చేత నుంచు కొనినారు. అది ప్రజానిర్వాచితులైన శాసనసభ్యమాత్రులకు సమన్వయింప నేర్పడినది కాదు. నిర్వాచితులై అధికారవర్గమున కెక్కువారలకయి దాని నాలోచించినారు. ప్రజాపరిపాలితదేశము లనుకొనువానిలో నెచ్చటను ముఖ్యకార్యనిర్వహణాధికారు లెవ్వరును ప్రజానిర్వాచితులు కానివా రుండరు. అమెరికాలో చక్రవర్తికి సరిపోవు అగ్రస్థానము నధిష్ఠించు నధికారి 'అధ్యక్షుడు' ప్రజలచేత నేరుగా నెన్నుకొన బడుచున్నాడు. మంత్రివర్గమును ఆతడు నిర్వాచితులైనప్రతినిధులలో నుండి నియమించుకొను చున్నాడు. ఆంగ్లరాజ్యమునందుకూడ నిర్వాచితులలో నెక్కువబలవంతమైన కక్షి నుండి చక్రవర్తి తన ముఖ్యమంత్రిని నియమించుకొనుచున్నాడు. ముఖ్యమంత్రి నిర్వాచితులలోనుండి తనకు వలసిన మంత్రిమండలిని ఏర్పరచుకొనుచున్నాడు. బ్రిటిషుసామ్రాజ్యమునకు అంకితములైన కనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, న్యూజీలెండు, ఇత్యాదులలోను దీనికి సరిపోలు పద్ధతియే కలదు. మనదేశములో ప్రజాప్రభుత్వమునకు సంకురార్పణముగ నిప్పుడు క్రొత్తపద్ధతి యొకటి ప్రారంభ మయినది. మంత్రివర్గములోని కొందరిని ఇదివరలో వలెనే గవర్నరులు తమ యిష్టానుసారము అధికారవర్గము నుండియో బయటి నుండియో నియమించుకొందురు. మరి కొందరిని (వీరికే మంత్రు లనుపేరు అన్వయించుచున్నది!) ప్రజానిర్వాచితులలోనుండి గవర్నరులు నియమించు కొనుచు

న్నారు. ఇది ఎట్లు ఫలించినను ఫలించునుగాక. ప్రజానిర్వాచితులై అధికారవర్గముకెక్కిన ప్రతినిధులు ప్రజాభిప్రాయవ్యతిరేకులైనప్పుడు మరి నిర్వచనము ప్రారంభమగువరకు అనగా మూడేండ్లో ఏడేండ్లో, నిలువక వారిని సన్మార్గమునకు దెచ్చుటకు కొన్ని రాజ్యములు చేసిన యాలోచన మనకు ప్రస్తుతాంశము. అమెరికా పురములలో కొన్నిట సిటీవల "రీకాలు" ("తిరిగిరా") పద్ధతి యుపక్రమింపబడినది. నిర్వచితప్రతినిధి అధికారమున నుండవచ్చునా లేదా యనువిషయమై సమ్మతులు నిర్వాచకవర్గము వారినుండి కనుగొనవలసినదని అందులో నియమితసంఖ్యాకులు మనవి అర్జిమూలకముగా కోరవచ్చును. అప్పుడు సమ్మతులు తీసికొని తీరవలెను. ఆసమ్మతుల ఫలమేమి తేలుచున్నదో దాని ననుసరించి ఆ నిర్వచితాధికారి అధికారమున నుండుటో మానుటో తీర్మానము కావలసినది. ఈసాధనమున కర్థమేమి? నిర్వాచకవర్గము నియమించుటకు నధికారి, తొలగించుటకు నధికారి.

<u>ఇతరమార్గములు:</u>— తొలగించు నధికారముమాట లోకమున బయలుదేరినది గాని ఉత్తమప్రజాప్రభుత్వము వెలసిన రాజ్యములలోనే దాని కింకను ప్రవేశము కలుగలేదు. కాబట్టి రాజ్యకార్యనిర్వహణము ప్రజాభిప్రాయానుసారముగ నానాటికి నుండున ట్లొనర్చుటకు అది సాధనముగా నెన్నరాదు. నిర్వచితసభ్యులు అభిప్రాయమున పొరబడినప్పుడెల్ల వారిని మరల మరల నిర్వచించు నవకాశములును లేవు, అవకాశము లున్నను నిర్వచించుట పొసగదు.

అందుచేత ప్రజాభిప్రాయము ప్రభుత్వములోని అధికారుల యభిప్రాయము ఒక్కటిగా నుంచుటకు నాగరకలోక మే ఏర్పాటుల చేసికొనినదో యెఱుంగుట యవసరము. ప్రభుత్వాధికారులు లోపములు చేసినచోట ప్రజలందరొక్క చోట సమావేశమై తమ యసమ్మతిని తెలుపుట మొదటి మార్గము. దీనికే సభలమూలకముగా పనిచేయుట యని పేరు. సభలు లోపములను కనుబరచుటకే కాక ఏదైనను జరుగ వలసిన కార్యమున్నయెడల దానిని సూచించి సలహా లిచ్చుటకును నుపయోగపడుచున్నది. సభలలో తీర్మానము లుపక్రమించుటయు ఆమోదించుటయు నను విషయములు చదువరులకు గ్రొత్తవి కావు. సభలుమాత్రమే కాదు, ప్రజాభిప్రాయమును వెలిబుచ్చు మార్గములు. మనవి అర్జీలును ఆపనినే నెరవేర్చుచున్నవి. దేశములోని పత్రికలు వీనియన్నిటికన్న నెక్కువగా ప్రజాభిప్రాయమును ప్రకటించుచుండు. ప్రజాపరిపాలితరాష్ట్రములలోనే యీసాధనములు ఉత్తమసాధనములుగా పరిగణింప బడుచున్నవి. ఆంగ్లసీమలో వీనియందు పత్రికలకు నగ్రస్థాన మిచ్చుచున్నారు. రాజు ప్రభువులసభ ప్రజాసభలకు తరువాత పత్రికలు నాల్గవ సంస్థగా వార లుగ్గడించుచున్నారు. కావుననే లోకమునందలి నాగరకరాష్ట్రము లన్నిటియందును పత్రికాస్వాతంత్ర్యమును పరమపవిత్రముగా కాపాడు ప్రయత్నములు జరిగి యున్నవి. స్వపరిపాలితరాష్ట్రములలోనే ప్రజలచే నెన్నుకొనబడిన ప్రతినిధులే అధికారులుగా నుండు రాష్ట్రములలోనే సభలు, అర్జీలు, పత్రికలు ప్రజాభిప్రా

ప్రకటనమునకు అత్యవసరములై యుండ ప్రజాపరిపాలన వాసనయున్న నేమో యెఱుంగని మనబోటి రాజ్యములలో వీని ప్రాముఖ్య మెంత యుండవలయునో సులభముగా గ్రహింప వచ్చును.

స్వపరిపాలితరాష్ట్రములలో ఈసాధనములే కాక ఇం కొక్క బలవత్తమ సాధనమును ప్రచారమున నున్నది. దాని కే "కత్తు"ల పద్ధతి యనిపేరు.

## కత్తులు.

ఏరాజో ఏమంత్రులో ఏఅధికారులో ప్రజలయభిప్రాయములకు బద్ధులుగాక పరిపాలించునంతకాలమును ప్రజలలో పరస్పరభిన్నాభిప్రాయము లేర్పడుటకు ఎక్కువ అవకాశము లేదు. అధికారుల నిరంకుశత్వమునకు ఏమిప్రతీకారము చేయ వచ్చునా యను ఆలోచనతోనే ప్రజలకు కాలము గడచిపోవు చున్నది. అధికారమున నుండువారలకు వ్యతిరేకత్వమును వహిం చుటయే యొక గొప్ప ఐక్యసాధనముగా పరిణమించుచున్నది. భరింపరానినిరంకుశత్వము పైబడి తమకష్టములను తమయిష్ట ములను సక్రమముగా శాసనబద్ధముగా చెప్పుకొను నవకాశ ములును అధికారులచేత తమసంకల్పములను జరిపించుననుకూ లములును ప్రజలకు లేనియప్పుడు ప్రజలు ఒక్కపెట్టున నెల్ల రును చేరి నిరంకుశులపై తిరుగబడి వారిని పదభ్రష్టులనుచేయు టచేతనో నిహతులను జేయుటచేతనో తమ యాశయములను దీర్చుకొనుటకు బ్రయత్నించుచువచ్చినట్లు చారిత్రక నిదర్శనము

లున్నవి. భాగవతంబున వేనునిచరిత్ర సుప్రసిద్ధంబయి యున్నది. పాశ్చాత్యచరిత్రం దడవితిమా ఆంగ్లరాజ్యచరిత్రం బుననే ఇరువురురాజులు ప్రజాక్రోశంబునకు నాహుతు లయి యుంట జనువందగు. ఆంగ్లభూమిచరిత్రయేల? ఐరోపాఖండ చరిత్రం బంతయును, ప్రజాప్రభుత్వంబులు ప్రారంభ మగువరకును, నిరంకుశపరిపాలకుల నష్టప్రాణముల బునాదిమీదనే నిర్మితమయి యున్నది.

అయిన నెల్లప్పుడును దారుణపద్ధతు లవలంబించుటకు రాదనుట స్వయంప్రకాశము. దారుణపద్ధతులవలన కోరంబడుఫలమును సూటిదప్పక సంభవించునది కాదు. ఒక్క నిరంకుశుడు నశించిన నింకొక్క నిరంకుశుడు బహుస్వల్పకాలములోనే మరల సిద్ధమగుచు వచ్చినాడు. పరాసుదేశచరిత్ర నిదర్శనముం గాంచుడు. నిరంకుశప్రభులబారినుండి దేశమును దప్పించు సదభిప్రాయముతో ప్రారంభించిన నెపోలియను తుదకు తానే నిరంకుశప్రభు వైపోయెను. అతని మనుమునినాటికి పరాసుభూమి మరల చక్రవర్తుల ప్రభుత్వమునకు లోబడి మరియొక విప్లవమునకు ఆయత్తపడవలసి వచ్చెను. విప్లవములు, హత్యలు, తిరుగుబాటులు ఎల్లకాలములయందును, ఎల్లయవస్థలయందును సాధ్యములు కాకపోవుటచేతను సాధ్యము లైనను ఫలవంతములు గాక యెక్కువ నిరంకుశత్వమును జనింప జేయునవికూడ నగుట తటస్థించుటచేతను ప్రజ లొకకొంత మేలుగొనినపిదప వారలొక్కసంఘముగా జేరి తమ యైక్యబలమును పురస్కరించుకొని నయభయముల రెంటిని విని

యోగించి తమ గూఢాశయములను పూరీకరించుకొనుటకు బ్రయత్నించినారు. ప్రజాప్రభుత్వములు లోకమున నెండై నిరంకుశపరిపాలనపద్ధతులు అచ్చటచ్చటమాత్రము నిలిచియుండు నీ యుగమున ప్రజాసంఘబల మింకీతిగా నెక్కువయుపయోగపడుచున్నది.

దేశీయమహాసభ:—మన హైందవభూమిలోని దేశీయమహాసభాందోళనమును దీనికి నిదర్శనముగా నంగీకరింపవచ్చును. రమారమి ముప్పది యెనిమిదేండ్లకాలముగ నడచివచ్చుచుండు నీయాందోళన క్రమముగా నిరంకుశపద్ధతిని ప్రజాపరిపాలనపద్ధతిక్రిందికి మార్చుటకు చేయంబడిన యాందోళనగాని మరి వేరు కాదు. దేశీయమహాసభ చరిత్రము నామూలాగ్రమున లిఖించుట కిది యదనుకాదు. ఉచితస్థలమున నాచరిత్రను చదువరులకు నివేదింపనగును. కాని యొక్కమాటమాత్రము సత్యము. నిరంకుశాధికారులగు ప్రజ లెదురొడ్డుచుండిన పశుబలపద్ధతులు మన దేశమున వేరుపారినవి గావు. బ్రిటిషు సామ్రాజ్యమునందే ఐర్లండుభూమి ఆ పద్ధతులకు పెద్ద నిదర్శనముగా నుండియు ఇటీవలనే దక్షిణాఫ్రికా పశుబలోపేతమగు తిరుగుబాటును సాధనముగా నంగీకరించి ఫలము పొందిన యట్లుల మనకంటియెదుట గోచరమయ్యెను మన దేశములో ననాదికాలముగా ప్రబలియుండు సాత్త్వికదృష్టియొక్క మాహాత్మ్యముననో ప్రభుత్వాధికారులు ప్రవిధమముననే మనలను నిరాయుధులను చేసివైచుటచేతనో లోకపరిణామమార్గమును

ధీమంతులైన మననాయకులు చక్కగా గ్రహించుటచేతనో యీయన్నికారణముల నైక్యముచేతనో పాశ్చాత్యభూములలో కొంచెమించుమించుగా స్వభావసిద్ధములైన మారణపద్ధతులీ భూమియందు కన్పించినట్లు కనిపించి యదృశ్యములైనవి. ఆంగ్లరాజనీతిజ్ఞులు బహుజాగరూకులై తత్తత్కాలమునకు దగిన యుపాయములను చేయుచు తమయధికారమును బోనాడుకొనక మెలగుచువచ్చినారు. వారిచర్యలలో ప్రజాప్రభుత్వము రానున్నదను నాశలు జనించుటచేత ప్రజాప్రభుత్వమునకు లోబడినరాష్ట్రములలో నేర్పడిన వాతావరణ మిచ్చటను కొంతవరకు నేర్పడినది. మొగలుసామ్రాజ్యావసానకాలమున సంభవించిన యరాచకస్థితులను ఆంగ్లప్రభుత్వము మాన్పుటచేత ఆవిషయమైనకృతజ్ఞత దేశమున వ్యాపించి యుండినందున ప్రభుత్వమున లోపము లెన్నికన్పించినను ప్రజాభిప్రాయము తీవ్రతనందుట కవకాశము కొంతకాలమువరకును కలుగలేదు. ౧౮౫౭ లో ఏ యసంతృప్తిచేతనో తీవ్రసంవేదన ప్రారంభమయి సిపాయిల తిరుగుబాటు జరుగగా ౧౮౫౮ లో శ్రీ విక్టోరియామహారాణి స్వతంత్రవరదాన పత్రమును ప్రకటించి యాందోళనమును మట్టుపెట్టెను. ౧౮౫౭ న జనించిన యసంతృప్తికి బలవత్తమమయిన కారణములేనందున ప్రీతి కృతజ్ఞవాతావరణమే దేశమున మరల ప్రబలెను. ౧౯౦౦వ సంవత్సరప్రాంతమువరకును ప్రజ లేకముఖముగా ఐకకంఠ్యముగా కొన్నికొన్ని సంస్కరణములను దేశీయమహాసభమూలకముగా కోరుచు వచ్చిరి. నిరంకుశాధికారుల ప్రతా

పము ప్రచండమై పోయెను. ప్రజలకు వేరుమార్గము కాన రాదయ్యె. నిరాశాజనితమైన కోపాగ్నివిస్ఫులింగము లటనట నెగురజొచ్చెను. రాజనీతికోవిదుడైన మార్లేప్రభువు ఒక వైపున కాఠిన్యమును కనుబరచుచు మరియొకవైపున ప్రజల కెక్కువ పలుకుబడి కలిగించుట కుపక్రమించెను. ఆపలు కుబడివలన కంటికగుపించుఫలములు కలిగెనా లేదాయను చర్చ యిచ్చట నవసరముగాదు. కొంతపలుకుబడి మీకును కలదు. మీరును కార్యనిర్వహణమున కర్తలే యనుట తోడనే మానవులలో క్రొత్తతలంపులు నవీనమగునాశలు ఉద్భవించుట స్వాభావికము. ఎప్పుడు నిరంకుశాధికారినిరంకు శత్వ మొక్కటియే యెదుర్కొనదగినది యను దృష్టి చెదిరి నచో అప్పుడే పదితలలలో పదియభిప్రాయములు పుట్టుటకు బీజస్థాపనము జరిగిన దనుకొనవచ్చును. మనదేశములో వెంటనే భేదాభిప్రాయములు కన్పించినవి. దేశీయమహాసభలో రెండుకక్షు లేర్పడినవి. తీవ్రవాదులు నమ్రవాదులు బయలుదే రినారు. దేశీయమహాసభయే రెండు శకలములు లైనది. క్రొత్త సంస్కరణము లొకకొంతకాలము సాగినవి. నమ్రవాదుల ఆశలు పూర్తికృతములు కాలేదు. వారే తీవ్రవాదులు కావల సివచ్చినది. తాము తీవ్రవాదులైనందున దేశములో భేదము లేదనుట వారికే స్ఫురించినది. దేశీయమహాసభశకలములు సంధించుట కవకాశము కలిగినది. నిరంకుశాధికారమున కెదు రొడ్డు నేకోద్దేశము మరల నైక్యమునకు మూలకారణ మైనది. తీవ్రాందోళన ఇంకొకపర్యాయము చెలరేగినది. కాని ఒక

పర్యాయము తలసూపినయట్టి బహుభావత్వము పూర్ణముగా నశింపలేదు. యుద్ధమే కారణముకానిండు, ఆంగ్లరాజనీతినైపుణ్యమే కానిండు, ఆంగ్లప్రజలయౌదార్యమే కానిండు, మనదేశములోజరిపిన యాందోళనమే కానిండు, ఏది కారణమైనను ఇవియెల్లయు కారణములే యైనను ఆవిమర్శతో మనకక్కరలేదు కాని ఇంకొకపర్యాయము ఆంగ్లరాజనీతిజ్ఞులు మేల్కాంచినారు. మాంటెగ్యూమంత్రి తనప్రతిభ నంతయు వినియోగించి ఆంగ్లప్రభుత్వమువారిచే హైందవభూమి స్వరాజ్యము పడసితీరవలసినదను ప్రకటనను చేయించి తదనుగుణముగా ప్రజలలో స్వరాజ్యార్హతకల్గించుటకు కొన్నిఏర్పాటులు శాసనమూలకముగా చేయుచున్నాడనని యుపక్రమించెను. అతనికార్యసరణి ప్రజలలో మరియొకమారు ఆశలను అంకురింపజేయుటచేత రంకుశాధికారమునకు వ్యతిరేకత్వమే కర్తవ్యమనుదృష్టి యిం కపర్యాయము చెదరినది. కొందరు క్రొత్తఏర్పాటులమూలముగా స్వరాజ్యమునకు ప్రథమసోపాన మేర్పడిన దనినారు. ందరీయేర్పాటులే స్వరాజ్యమున ప్రథమావస్థ యని తలంనారు. ఈఏర్పాటులవలన నేమియు లాభములే దనువారును ందరేర్పడినారు. దేశీయమహాసభయే నవీనశాసనము అసంర్ణము, అసంతృప్తికరము, ఆశాభంగకరము నని నిశ్చయించిది. ఇన్ని భిన్నాభిప్రాయము లుండుటచేత మనవాతావరణన మరల "కక్ష" లరొద యెక్కువగా విన్పించినది. శాసము అమలులోనికివచ్చి కార్యములు ఉపక్రమితములైనవి.

ఒక వైపు మాంటెగూ సంస్కరణము లుపక్రమితము లగుచుండ ఇంకొక వైపు నిర్బంధ శాసనము లుపక్రమితములయి పంజాబులో సైనిక శాసనమే ప్రచారమునకువచ్చినది. దానిని సాకుచేసికొని జనరలు ఓడ్వైయరను అధికారాధముడు, శాంతులు, నిరాయుధులు, నిరపరాధులు నగు భారత సోదరులను మూగ్గకొలదిని మరఫిరంగి గుండ్లకెర చేసి వేయినైనూరుమందిని గాయములుపడజేయు కార్యమున కొడిగట్టెను. అతనిబోలిన ఇతరాధికారులు ఆ సైనికపరిపాలన పేరటనే నోట వచింపరాని యట్టి దుర్మార్గములను స్త్రీలయెడలను, బిడ్డలయెడలను జరిపిరి. ఈ విషయమంతయు విస్పష్టమగువరకు మహాత్ముడు గాంధి అధికారులయెడల సానుభూతి కలవాడుగనే యుండినవాడు. వారెన్నటికయినను న్యాయమును అనుసరించి భారతదేశపు స్వత్వములను ప్రసాదింతురను విశ్వాసము తోడనే ప్రవర్తించినాడు. అమృతసరము దేశీయమహాసభయందు విశేష సంఖ్యాకులగు ప్రతినిధులు తన్నెదిరించుచుండినను మాంటెగూ మంత్రి సంస్కరణశాసనమునకుగాను వందనములు సమర్పింపవలసినదని గట్టిపట్టు పట్టినాడు. సంస్కరణ ప్రణాళికను అమలులోపెట్టి దానియుపయోగ నిరుపయోగములను కనుగొనవలసినదని అభిప్రాయపడియుండినాడు. కాని పంజాబు దురంతముల విషయమును స్వయముగా విచారించినమీదట పశుబలప్రేరితాధికారులు జరిపిన ఘోరములు ఇట్టివని అతనికి శల్యాగతమయినది. అంతటి అపచారములు భారతీయులు అనుభవించిన వెనుక—అపచారములు జరిగినవియని యంగీకరించు

చునుగూడ—అధికారులు అందుకుతగిన ప్రతీకారముచేయుటకు బదులుగ ఓద్యోయూడు ఇత్యాదులను పెంషనులిచ్చి సుఖజీవనము చేయవచ్చునని సెలవిచ్చి పంపుటచేత గాంధిమహాత్ముని దృష్టి సంపూర్ణముగా మారిపోయి ౧౯౦౭ వ సంవత్సరముననే మహారాజు తిలకు యాజమాన్యముననే చతుర్విధ బహిష్కారములతో—విద్యాలయ బహిష్కారము, కోర్టుల బహిష్కారము, విదేశవస్త్రవస్తుబహిష్కారము, ప్రభుత్వోద్యోగబహిష్కారము—ఆరంభమయి కొంత కొనసాగిన అసహాయోద్యమము మరి మూడు బహిష్కారములతో—శాసనసభల బహిష్కారముతో, తాగుడుబహిష్కారముతో, అస్పృశ్యతబహిష్కారముతో—నాటి యాధారముతోగాక హైందవ భూమికి సహజన్మంబగు శాంతబలాధారముతో నవీనాకారమునుదాల్చి యుద్భవించినది. ౧౯౦౫లో వికసించిన స్వయంసహాయసూత్రము, ఈ నూతనదృష్టి ప్రజలకు సమకూరునప్పటికి, ఆత్మస్వరూప నిర్ణయసూత్రముగా మారిపోయి స్వరాజ్య నిర్మాణ కార్యక్రమమునకు అంకురార్పణము చేసినది. బహిష్కారమనునది విద్వేషసూచక మహాసాధనముగాక ఆత్మబలనిర్మాణక మహాశక్తిగా పరిణమించినది. ౧౯౨౦ లో నూతనసంస్కరణప్రణాళిక అమలులోపెట్టిన నిమేషమునజరిగినఎన్నికలను—కొన్నికొన్ని ప్రాంతములలో రెండుమూడు మాసముల యాందోళన మాత్రముతో—భారతభూమి అత్యద్భుతభంగిని బహిష్కరించి వైచినది. కొన్నికొన్నిస్థలములలో—ముఖ్యముగా ఆంధ్రదేశమునందు—వోటులపెట్టెలు వట్టివి తిరిగిపోయి

నవి. అయిన నవీనమగుఆశలు అంకురించియున్నందున క్రొత్తగా నేర్పడువిధానమున నిజముగానే కొందరు హైందవులకు కొంత ఎక్కువపలుకుబడి కలుగనుండుటచేత శాసనసభలమోహమును, క్రొత్తరాజకీయ సంస్కరణముల మోహమును కొందరకు తప్పినదికాదు. కాబట్టి శాసనసభలను ప్రవేశించువారును అధికారులు ప్రసాదించిన పదవులను స్వీకరించి స్వలాభమును ప్రజాలాభమును రెండును నేకకాలమున అంకితరాష్ట్రములలో సంపాదించుట యసాధ్యమనుమాట యాలోచింపక స్వలాభ ప్రజాలాభములను నొక్కట సంపాదింతుమని యుపక్రమించినవారును కొందరు బయలుదేరినారు. జరిగిన కార్యక్రమమునుబట్టి చూడగా నూతన సంస్కరణములవలన ప్రజలకు కలిగినలాభ మెయ్యదియని వ్రేలుమడచి జూపింపగలిగిన దొక్కటియు కానరాలేదు.* నాడు మావారు మావారని పరువులెత్తుచు కొంతవరకు వోటులిచ్చి వచ్చినప్రజయే అసహాయోద్యమమున జేరి తమ ప్రతినిధులుగాపోయి మంత్రిపదవు లలంకరించిన మహానుభావులకే మంచినీళ్ళయినను ఇయ్యరాదని కట్టుగట్టిరి. మంత్రులనుమాటయేల? ఆరాచకొమరుడే దేశమును చూచిపోవుటకని రాగా అతనిని సత్కరించుటకు పోవువారు ప్రభుత్వోద్యోగులో ఏగౌరవబిరుదాంకితులో దక్క ఒరులెవ్వరును ఎక్కువమంది కన్పింపలేదు. అసహాయోద్యమపక్షమున దేశమంతయు నుండిపోయినదనినను తప్పుగాదు. ప్రభుత్వాధి

* కౌన్సిళ్ళ సంక్షిప్తచరిత్రము ప్రత్యేకముగా ప్రకటితమగుచున్నది.

కారులు నూర్లకునూర్లు వేలకువేలు ప్రజలను కారాగారము నకు బంపినకొల్లల మరి నూర్లకునూర్లు వేలకువేలు ప్రజలు సిద్ధముగుచు వచ్చిరి. శుద్ధసాత్త్వికమూర్తి గాంధీమహాత్ముడు నాయకత్త్వము వహించినంతకాలము భారతభూమిలో పేరునకు అనేకకక్షలున్నట్లు కన్పించినను నిజమునకు రెండుకక్షలే యుండినవనుట స్పష్టము— ప్రభుత్వకక్ష, ప్రజాకక్ష. వీనినే సహాయవాదము, అసహాయవాదము అనుపేళ్ళతో ప్రపంచము వ్యవహరించినది. ఎంతకాలము గాంధినాయకత్త్వము బలవత్తమముగా నుండినదో అంతకాలము శాసనసభ్యులు వారి యనుచరులు—అసహాయవాదులు కాని రాజకీయ పక్షము లన్నియును ఈవర్ణనలో నిమిడిపోవుచున్నవి— అధికారపక్షముతో నేకమై పోవలసివచ్చినది. భారతప్రజయంతయు తద్వ్యతిరేకపక్షముగా నేర్పడినది. మహాత్ముని అధికారులు నిర్బంధించుటతో అసహాయవాదము అవలంబించిన కొన్ని పద్ధతులు తాత్కాలికముగా ఫలవంతము కాకపోవుటచే అసహాయవాదపక్షముననే రెండుచీలికలు కన్పించినవి. సహాయవాదముపక్షముననుండిన వేరువేరుకక్షలును పరిస్ఫుటముగా మరల నాకర్షింపజొచ్చినవి. అధికారులచర్యలు మరల ప్రజల పరాధీనతను పరిస్ఫుటముచేయజొచ్చినవి. ప్రజలలో మరల భావోద్రేకము విజృంభింపదొడగినది. మరలనేనిమేషమున ప్రజలు కక్షులను రొదలను తమ ఏకవాక్యముచే ముంచివైచి అధికారపక్షమును నేమార్గమున నెదురొ్కందురో, ఏనిమేషమున నీకక్షలన్నియు అధికారపక్షము ప్రజా

క్షము అను రెండుపక్షములక్రింద మారిపోవునో చెప్పగల
స్మృతిపశాస్త్రజ్ఞు డెవ్వడును లేదు. కాని స్వరాజ్యము దేశము
కు సంపాదిత మగువరకును నిజమగుకక్షలు ఇవి రెండే
యనియు తక్కుంగలకక్షలు తాత్కాలికభయముచేత మో
హముచేత ఆశలచేత అవతరించుచు అంతరించుచు నుండునని
యు ఏనాడైనను గ్రహింపగలము.

ఈవర్ణన యంతటివలనను ఒక్కసంగతిమాత్రము నిజము. సి
శ్చయమైన ప్రజాప్రభుత్వము సంస్థాపితమగువరకును "కక్ష"ల
రొద కలుగుచు పోవుచునే యుండును. క్రొత్త వింతయైననాడు
ఆశాసనలు పొడసూపిననాడు తలకొకమాటయై "కక్ష"లు
కాన్పించును. పాతరోతయై నిరంకుశాధికారమును మట్టు
పెట్టుటే దృష్టిగా బరగునాడు "కక్ష"లడంగును. అయిన నీకక్ష
లకథ ఇంతదూరము మేల చెప్పవలయు నందురేమో? స్వపరిపాలి
తరాష్ట్రములలోనేగాని శాశ్వతకక్ష లేర్పడవని నిరూపించుట
కును స్వపరిపాలనముయొక్క యాశ ప్రారంభమై ఆయాశకు
అవలంబనభావ మొక్కటి తలచూపినంతనే "కక్ష"ల పొడ
కాన్పించుననియు ప్రజాప్రభుత్వ ముపక్రమితమైనవెంటనే
"కక్ష"లు తప్పవనియు సూచించుటకును నని తెలియందగును.

రాజసతామసములు:— పైనవివరించిన మనదేశపు
పరిణామము ననుసరించిననేమి, లోకములోని మానవస్వభావ
మును తిలకించిననేమి, మనలో రెండు భిన్నప్రకృతు లుండుట
స్పష్టము కాగలదు, నమ్రత,తీవ్రత. వీనినే మనపూర్వికులు సాత్త్వి

క రాజసములుగా వర్ణించిరి. ఇంకొక్కప్రకృతినిగూడ మన పూర్వికులు గమనింపక పోలేదు. తామసమును వారీరెంటితో మూడవదిగా వర్ణించిరి. అయిన దానిని అధమప్రకృతియని యు, రాక్షసప్రకృతియనియు వారు తిరస్కరించిరి. లోకము లోని ఇతరరాజ్యములవారును రాష్ట్రములవారును తామస ప్రకృతిని శాసనబద్ధరూపముగా సంగ్రామాదికపరిణామముల జూపుచున్నను వారును దీని నధమప్రకృతిగానే యంగీకరించి నారు. సాధారణమగు రాజకార్యములలో తామసప్రకృతికి ప్రవేశ ముండరా దనుట నాగరకప్రపంచమున సంప్రదాయము చేయవలయునని ఎన్నియోప్రయత్నములు జరిగినవి, జరుగు చున్నవి,జరుగగలవు. హేగుకాన్ఫరెన్సులని లీగుఆఫునేషన్సు అని పాశ్చాత్యులు కొన్నిసంస్థలను నిలుప జూచినారు. కాని వారి భావములును దృష్టియు నింకను విషయసౌఖ్యసంపాద నముపైనుండి మారకపోయినందున ఇప్పటికి ఎక్కువఫలము కలుగలేదు. స్వతంత్రాధికారముగల రాష్ట్రములవారినే తామ సప్రకృతి ఇంకను బాధించుచుండ అంకితమైన మనదేశమువంటి దేశములలో దానిప్రతిష్ఠ తగ్గునని యనుకొనుటకు రాదు. నిరంకుశాధికారదుర్వ్యూహులుగూడ అనేకులు తామసపద్ధతుల ను అవలంబించునప్పుడుగూడ తాము అవలంబిచుట లేదని నోట ననుచు అవలంబించు చున్నారు. ఎవ్వరో కొందరుమాత్రము ఖడ్గముచేత జయించితిమి, ఖడ్గముచేతనే నిలుపుకొందుము అని సిగ్గుబిడియములువీడి అనువారున్నారు. తాము అవలంబించిన తామసపథముచే ప్రజలలో నెక్కడేని కొంచెము తామసము

ప్రతిబింబముగా దోచినప్పుడెల్ల అదుగో అచట నీప్రకృతి కలదుకావున మేమును దాని ననుసరించితిమను మృషావాదులును నున్నారు. ఎట్లయిననేమి? తామసప్రకృతికి రాజ్యనిర్వాహణమున ప్రతిష్ఠ నశించుచున్నను ప్రాబల్యముమాత్రము పూర్తిగా తగ్గలేదు.

ఇక సాత్త్విక రాజసములను రెంటినిగురించి ఆలోచింతము. వీనికి పూర్ణమగు ప్రత్యేకత్వము ఉన్నదని చెప్పుటకు రాదు. ఒకే వ్యక్తియందు సాత్త్విక రాజసములు రెండును ప్రదర్శితము లగుచున్నవి. అయిన నీరెండు గుణములును సమాన బలముగ నుండుట ఎప్పుడును పొసగునది కాదు. సాత్త్వికమైనను ప్రధానము కావలెను. రాజసమైనను ప్రధానము కావలెను. పూర్ణస్వాతంత్ర్యము కలరాష్ట్రములలో కక్షులకు కారణము సామాన్యముగా నీరెండు గుణములే. సాత్త్విక ప్రకృతి గలవారు సాధారణముగా ఉన్నతస్థితితో తనివి నందుచు కాలక్రమమున పరిస్థితిపరిపాకమున నుత్తర ఉత్తమ స్థితుల నందుటకు నాలోచింతురు. రాజసప్రకృతి కలవారు ఉన్నతస్థితితో తనవి నందరు. ఉత్తమస్థితికి నెంత వేగగమనమున నడుగనగునో అంత వేగగమనమున నరుగుటకు ప్రయత్నములు చేయుచుందురు. తాలిమి యొక్కరిలక్షణము. ప్రవృద్ధికొరకు చలనము రెండవవారిలక్షణము. ఈ రెండు గుణములే నిజముగా కక్షులు ప్రబలుటకు కారణములయినను ఇందులోను మానవులయొక్క ఉద్రేకము అలవలనుబట్టి ఎక్కువసాత్త్వికులు, కొంచెము తక్కువసాత్త్విక

గుణము గలవారు, రాజసులు, కొంచెము తక్కువ రాజసగుణము కలవారు, ఇట్టి తారతమ్యము లుండకపోవు. కాబట్టి సాధారణముగా రెండేరాజకీయ కక్షలుగల భూమియని ప్రసిద్ధి వడసిన ఇంగ్లండులోకూడ నేటిదినము రెండుకక్షలు మాత్రమే గాక పార్లమెంటులో కన్సర్వేటివులు, కొయలిషను లిబరలులు, లిబరలులు లేబరువారు అని నాలుగు కక్షలు కన్పించుచున్నవి. ఇట్టి రాజససాత్త్విక గుణముల ప్రసక్తియే కాక ఈ కక్షల విభాగమునకు ఇతర హేతువులును కాన్పించుచున్నవి. సాత్త్విక రాజసగుణములుకల కర్మకరులు సంఘములో తమవిభాగమునకు రాజకీయాధికారము కలుగవలయునను నుద్దేశమున క్రొత్త కక్షగా పొడసూపినారు. ఈకక్ష ౧౯౧౨వ సంవత్సరపర్యంతమువరకు పుట్టనైనను పుట్టియుండలేదు. ఆఏట ౪౨ సభ్యులు మాత్రము వీరిపక్షమువారుండినారు. ఈనాటికి వీరు పార్లమెంటులో ౧౪౪ గురు ప్రతినిధులను సంపాదించుకొని ఇదివరకు ఎన్నడును అనుభవించని ఎదురుపక్షము * అను గౌరవమును అనుభవించుచున్నారు. ఇంకొకపర్యాయము ఎన్నికలలో వీరే ప్రభుత్వాధికారధూర్వహులయినను కావచ్చును. కాబట్టి ప్రపంచములోని రాజ్యాంగ నిర్ణయములలో నేర్పడుకక్షలకు

* ఇంగ్లండులో ఒకపక్షము అధికారమునందున్న నింకొకపక్షము వారికెదురుపక్షముగానుండి తదుచితగౌరవసన్మానములందుట ఆచారము. పార్లమెంటుసభాధ్యక్షుడగు స్పీకరును పిలుచుకొనివచ్చునప్పుడు అధికారపక్షనాయకుడును ఎదురుపక్షనాయకుడును కలసి పిలుచుకొని వత్తురు. ఈపర్యాయము లేబరునాయకుడు కన్సర్వేటివునాయకునితో చేరి ఈపని నిర్వహించినాడు.

వట్టి సాత్త్వికరాజసగుణములే కాక కొన్ని ప్రత్యేకోద్దేశములును కారణములు కావచ్చుననుట స్పష్టము.

ఉద్భవము—కారణములు:— ఎప్పుడు మానవుడు తనప్రగతిని నిశ్చయించుకొనుటకు అధికారము కలవాడగుచున్నాడో, అప్పుడాతడు తన నిజస్వభావమును అనుసరించుటకు వీలు కలుగుచున్నది. అంతదనుక యింకొకని నిరంకుశత్వమును సమయించుటకై భేదస్వభావములు కల తనసోదరులతో కలసియుండక తప్పదు. ఈన్యాయమే 'జవాబుదారీ' పరిపాలనపద్ధతుల నుపక్రమించుటకు ప్రథమాధారము. 'జవాబుదారీ' పరిపాలన యనిన ప్రజలసంకల్పమునకు లోబడి పని చేయునట్టి పద్ధతి ఈ 'జవాబుదారీ' పూర్ణమగువరకును నిరంకుశత్వము రాజ్యాంగములలో నెక్కడనైనను నివసించియున్నంతవరకును ఈరెండుగుణముల ప్రత్యేకత్వము అంత స్ఫుటముగా ప్రకాశింపదు. మరి యేయితరకారణములో పొడసూపి 'కక్షుల' చరిత్రయందు బహువిధములగు నుపాఖ్యానములను కలిగించుచుండును.

అమెరికాసంయుక్తరాష్ట్రములు, ఇంగ్లాండు వీనిలోని కక్షలస్థితిని ఐరోపాలోని ఇతరరాజ్యములయందలి కక్షుల స్థితిని పరీక్షించినయెడల నీతారతమ్యము విస్పష్టము కాగలదు. ఏవో అంతశ్శాఖ లున్నట్లుగా ఇంగ్లండులో కానవచ్చినను అచ్చట ముఖ్య 'కక్షు'లు మూడే కలవు. అమెరికాలోను ఇదేరీతిని కక్షు లేర్పడియున్నవి. ప్రభుత్వాధికారమున నొక కక్షి యుండును. దానికి విమర్శకమై యింకొకకక్షి పని

చేయుచుండును. ఈ రెంటిని విభేదపరచునట్టిశక్తి రాజససాత్త్వికగుణవిభేదమే. ఉత్తమప్రజాప్రభుత్వ మీరెండురాజ్యములలోను వీని యధినివేశములును అనుసరములును నగు రాజ్యములలోను యిప్పటికి ఏర్పడియుండుటనుబట్టి ఇట్టిఫలము కలిగినదని చెప్పవచ్చును. ప్రజాప్రభుత్వ మంతబలవత్తమముకాక కొన్నియంగములలో నిరంకుశత్వమున కెడముండు ఇతరరాజ్యములలో ముఖ్యముగా ఐరోపాఖండభూమియందు రెండు కక్షలేకాదు, పండ్రెండుకక్షలు కూడ గలవు. ఈకక్షలకేమి యాధారమందురా? స్వభావసిద్ధమగు సాత్త్విక రాజస గుణంబుల కితరోద్దీపకములు సహాయభూతము లగుచున్నవి. ప్రజాప్రభుత్వమనిననే యెల్లరకును తమయిష్టానుసార మాలోచించుటకు, తమయిష్టము నితరులకు జెప్పుటకు తమయిష్టము నితరులకు బట్టించుటకు అధికార మనుట విశదము. భావస్వాతంత్ర్యము వాక్స్వాతంత్ర్యము నివిరెండును, 'వోటు' అనంబడు 'సమ్మతి' పుట్టినతోడనే సాధారణముగా స్థిరమగుచున్నవి స్వాతంత్ర్యము సమకూరి అభిప్రాయప్రకటనమునకు అవకాశము లేర్పడినప్పుడు మేధావంతులు రాజ్యాభివృద్ధికి మార్గములను తమతమ మేధాసంపత్తిచేత నిర్ణయింతురు. విదేశములతో నుండదగిన సంబంధముల విషయమున భేదాభిప్రాయములు కలుగవచ్చును. విద్యావిధానముల విషయమున పన్నులు విధించువిషయముల నిషేధించు విషయముల ఇత్యాది విభేదములు కలుగవచ్చును. ప్రజాప్రభుత్వమున ఏయభిప్రాయమువాడైనను ఏనాటికో యొక్కనాటికి తానును

నకు న్యాయము అత్యవసరము అని తోచినమార్గమున రాజ్యము నడిపింప నర్హతగలవా డగుటచేత తనచుట్టును తన యభిప్రాయమువారిని చేర్చుకొని తన యుద్దేశములను వ్యాపింప జేసికొనుచు వచ్చుచున్నాడు. ఉత్తమమేధావంతులగు నాయకుల ననుసరించునట్టివారలు తమతమ నాయకుని నేనాటికైన ను ప్రభుత్వాధికారమునకు కొనివచ్చి అతనియాదర్శము లను ఫలవంతము చేయుటకు ప్రయత్నపడుదురు. అందుకు గాను తగిన యాందోళన జరుపుచు, సంస్థల నేర్పరచుచు వారు తమ బలమును సంఖ్యను అభివృద్ధిచేసికొను మార్గ ములు అహరహము వెదకుచునే యుందురు. ముక్తసరిగా చెప్పదలచుకొనునెడల 'కక్షు'లయుద్భవమున కిదియే కార ణము.

తీక్ష్ణసమస్యలు:—రాజ్యమునకు సంబంధించిన గొప్ప రాజనీతిప్రశ్నలుగాని తీక్ష్ణతమసమస్యలుగాని పొడసూపి నప్పుడే కక్షులభేదము స్ఫుటతమమగుచున్నది. అట్టిసమయ మునసే గొప్పకక్షులు బలవత్తమమయిన కక్ష లేర్పడుటకూడ సంభవించుచున్నది. ఒకపథమును సరిష్టముగా నెంచువారం దరు తమలో తమకుగల స్వల్పవిభేదములను పాటింపక యేక మగుట సంభవించుచున్నది. ఒక్కొకపర్యాయము ఒకకక్షులో నివారు మరియొక కక్షలో చేరపోవుటయు తటస్థింపవచ్చును. ఆయాసందర్భమును ననుసరించి వ్యక్తులలోని రాజసస్వాత్త్వి క ప్రకృతులే తారుమారు కావచ్చును. అరిష్టముగా నెంచు వారొక కక్షకుజేర తత్పథమునే మహాసాధనముగా నెంచ

వారందరును తమలో తమకుగల విభేదములను లక్ష్యపెట్టక నొక్కటిగా చేరుకొందురు.

ఆంగ్లభూమిలో రాజునకును ప్రజలకును కలిగిన పోరాటముచేత రాజుపక్షమున చేరినవారు కొందరును, ప్రజలయాధికారమునే ముఖ్యతమముగా గణించినవారు కొందరును ౧౬౮౮ లో చూపట్టి "టోరీలు" "విగ్గులు" అను తెగలుగ నేర్పడిరి. వంశపారంపర్యమును భేదింపరాదనియు అందువలన స్టూవర్టువంశమునకు చేరినవారినే రాజుగనియమించుట యావసరముకావున పారిపోయిన జేమ్సును పిలిపించి అతనికిని అతనిసంతతికిని రాజ్యపదమును పట్టముగట్టవలసినదని టోరీలభిప్రాయపడిరి. రాజ్యాంగసభవారు వంశక్రమము తప్పినను తప్పవచ్చునని నిశ్చయించుటనుచేసి వారి ప్రజామాన్యమును నిలువబెట్టుటకు వారి తీర్మానమునే నడిపింపవలసినదని విగ్గులు నిశ్చయించిరి. ఇదియే ఆంగ్లభూమిలో ప్రప్రథమమున కక్షలేర్పడుటకు కారణము. ఇదేవిధమైనకారణమే పరాసుభూమిలోను కక్షలేరడుటకు మూలమైనది. అమెరికాసంయుక్తరాష్ట్రములలో మొదటి యాధ్యక్షునికాలమందు ఒక్కముఖ్యసమస్య పొడసూపెను. సంయోగప్రభుత్వమునకు అధికారమెక్కువగ నియ్యవలయునా? రాష్ట్రప్రభుత్వములకు నెక్కువ అధికారముండవలయునా? అనువిషయముల విభేదములు కలిగెను. సంయోగప్రభుత్వపుపక్షమున నుండినవారు ఫెడరెలులనియు రాష్ట్రాధికారవాదులు రిపబ్లికనులనియు చీలిపోయిరి. తరు

వా తికాలమున బానిసల విముక్తిసమస్య బయలుదేరగా
రిపబ్లికనులనియు, డెమక్రాటిక్కులనియు క్రొత్తకక్షు లేర్ప
డెను. అప్పటికప్పుడు ఈవిధమగు బలవద్విభేదములు ఎల్లదేశ
ములలోను కక్షులను తారుమారుచేయుచు వచ్చినవి. ఇటీవల
నడచిన మహాసంగ్రామము ఇంగ్లాండులోని కక్షులను తాత్కా
లికముగ తుడిచివైచెను. కాన్సర్వేటివు లిబరలు అను
ముఖ్యవిభేదములును యూనియనిష్టులేబరు ఇత్యాది విభే
దములును అన్నియు అంతరించి కొయలీషన్ అనుపేరిట
నెల్లకక్షుల యైక్యభావమైన మరియొకకక్షు యేర్పడెను.
యుద్ధము ముగిసినవెనుక దానిబలము తగ్గి మరల లిబరలు
లేబరు యూనియనిష్టు ఇత్యాదిపేళ్లు పైకి వినవచ్చినవి.

కారణవిమర్శ:— ఏకారణమును ఆధారముగాకొని
కక్షు లేర్పడుచున్నవో, ఆకారణమునుబట్టియు కక్షులకు పరస్ప
రముండు సంబంధమునుబట్టియు దేశక్షేమమును దేశశాంతి
యును సంపాదితములగుననుట నిజము. ఈవిషయమును
మనసున నిడికొనియే మొదట మొదట రాజనీతిజ్ఞులయినవారు
ప్రజాప్రభుత్వములయందు కక్షులేర్పడుట అనర్థదాయకమని
అభిప్రాయపడుచు వచ్చిరి. ప్రజాప్రభుత్వము విజయము
పొందవలయునను మహదాశయము కలవారగుటచేత వార
లీరీతిగ సంవేదనపడిరి. ఇప్పుడు మనదేశమున ప్రజాప్రభుత్వ
మున్నను లేకున్నను రానున్నదను ఆశమాత్రముచేత కలిగిన
విభేదములను పురస్కరించుకొని యేర్పడుచుండు వివిధపక్షము

లవారిని జూచి యీదేశమునకును అనర్థము మూడనున్నదని యనువారు కలరు. ఆనాటి పాశ్చాత్య రాజకోవిదులును ఈనాటి మన సోదరులగు ఈ రాజనీతికోవిదులును భ్రమపడు చున్నారనిన తప్పుకానేరదు. మానవదృష్టి పూర్ణముగా పరిపాకము కానియంతవరకును పక్షములు కక్షలు తప్పునవి కావు. ప్రజాప్రభుత్వము లోకమునందు స్థాపితమై యెంతో కాలము కాలేదు. దాని సంపూర్ణస్వరూప మింకను నేర్పడవలసి యున్నది. కాని, కక్షలనివార్యములనియు అంతేగాక వానివలన నుపయోగముకూడ ఓపినంత కలదనియు నేటికి తేటతెల్లమై యున్నది. ప్రజాప్రభుత్వము చక్కగా వేళ్లు పారిన కాలమున పాశ్చాత్యభూములలో కక్షలవలన విశేషమగు గందరగోళములు కలిగినమాట వాస్తవమే. వివిధమగు అంతస్థులుగ విభాగితులయిన ప్రజలు ఆథెంసులోను రోమకసామ్రాజ్యములోను తమలో తాము పెట్టుకొన్న పోరాటములను ఇటాలియాలోని ప్రజాసత్తాకములలో గ్వెల్ఫు గిబ్బెలును లను తెగలక్రు జరిగిన హాహాకారి పోట్లాటలును ఆంగ్లభూమిలో జరిగిన అంతర్దేశీయయుద్ధమును ప్రజాప్రభుత్వారంభమితోడ కనుపించు కక్షలవిభాగము దేశశాంతికిని దేశక్షేమమునకును విఘాతకరమని తోపింపచేసినది. అయిన నేటిదినము నాగరక రాజ్యములలో నేర్పడియుండు కక్షలచరిత్ర చూచినచో ప్రజలకు శాంత పూర్ణాధికారము కలచోట ఇట్టి పోరాటములకు ఎడములేదను మట స్పష్టముకాగలదు. అట్టిరాష్ట్రములలో రాజకీయకక్ష

లన్నియును ఆయారాజ్యములలో స్థాపితములయిన ప్రభుత్వ ములకును ప్రభుత్వముల కాధారభూతమైన సంస్థాపనలకును వైరము వహించుటలేదు.

ఏనాఁడో యొకనాడు తాము అధికారమునకు రాగ లవారమను అభిప్రాయము ఎల్లకక్షులవారికిని కలదుకావున వీరెల్లరునుగూడ తమతమ రాజ్యాంగముల సూత్రములకు లో బడి తమపక్షమును సాధించుటకు ప్రయత్నించుచుందురు. అయినను జాతి మతవిభేదములమీాద ఆధారపడిగాని సాంఘిక విభేదములమీాంద ఆధారపడిగాని కక్షులేర్పడరాదని కొందరు పాశ్చాత్యులయిన రాజనీతిశాస్త్రవేత్తలు అభిప్రాయపడియు న్నారు. ఇందులకుకారణ మాలోచింపవలసియున్నది. ఈ ఆధా రములపై కక్షులేర్పడినయెడల ఈ కక్షులలో నొక్కొక్కటియు తన యెదుటివారు విజయవంతులయినచో అన్నివిధములను తన్ను రూపుమాప ప్రయత్నింతురని విశ్వసించునది అగును. కాబట్టి తుదివరకు పోట్లాడుటయే దానికికర్తవ్యముగ దోచును. ఆయుధములు తీసికొని పరస్పరవినాశనము చేసికొనినను చేసి కొనకున్నను ఇట్టికక్షులు ప్రజలలో అనవసరమైన వైషమ్యము లను పెంచి ప్రభుత్వకార్యముల సరళగమనమును నిరోధించును. కాబట్టి నిశ్చయస్వాతంత్ర్యమును కోరునట్టి జాతులు జాగరూ కలమై మెలంగి రాజకీయకక్షులను నిర్మించుకొనుటలో ఈ విభే దములు కారణములు కాకుండ నడచుకొనవలసియున్నారు.

ఏరాజకీయకక్షుకు చేరినవారైనను ఇతరకక్షులకు చేరినవారు తమవలెనే సత్యప్రియులనియు తమవలెనే సమర్థులనియు, తమ

వలెనే దేశాభిమానులనియు అంగీకరించినంగాని సత్ఫలమేర్ప డదు. పాశ్చాత్యదేశములలో రాజకీయకక్షలచరిత్రను పరిశీలింపగా రానురాను వానిలో వానికిగల వైషమ్యములు, వైపరీత్యములు అడంగుట కానవచ్చుచున్నది. నిర్వచనములలో పరాజయమొందినట్టివారు పూర్వమువలె పటపట పండ్లుగొరుకక యెక్కువసంఖ్యాకుల నిర్ణయముగదా! ఇది అనుసరింపక తప్పదు అని తృప్తిపడి యథావిధిగ తమధర్మమును నిర్వహింపనారంభించుచున్నారు. తామెంతయాసక్తితో దేశక్షేమమును కోరి వ్యాకులపడుచున్నారో యెదుటివారును అంతియాతురతతో దేశక్షేమమును కోరుచున్నారని అంగీకరించుచున్నారు. అయిన కొన్నికొన్ని దేశములలో నిర్వాచకవర్గముండియు సమ్మతులమూలకముగా ప్రజలకు అధికారముండియు ప్రజాప్రభుత్వమునకు ప్రథమాంగమనందగు ప్రజాప్రతినిధిసభయందు ప్రాతినిధ్యము కలిగియు ప్రజలలో నొక్కభాగము వారికే యధికారప్రాబల్యము కలుగుట సంభవించుచున్నది. ప్రస్యాసంగతి యిదివరకే వ్రాసితిమి. బ్రిటిషుసామ్రాజ్యమునకు చేరిన ఐర్లాండుసమస్యయు మొన్నటివరకును ఇట్టిదియే యేర్పడియుండినది. ఆంగ్లదేశపు ప్రజాప్రతినిధిసభలో ముప్పదిగురు ఐర్లాండుప్రతినిధు లుండురుకాని రమారమి యేడువందలసంఖ్యలో వీరు బహుస్వల్పసంఖ్యాకులగుటవలనను ఇతరకారణములవలనను వీరిమాట మెచ్చుటను సాగుచుండలేదు. స్వపరిపాలనయూ లేదు. నిరంకుశాధికారవర్గము యొక్క పరిపాలనమే వ్యాపించియుండినది. కాబట్టి

ఆంగ్లప్రజాప్రతినిధిసభయందు తా మెప్పటికైనను బలవంతుల మగుదుమను నాశగాని తమపలుకుబడి చెల్లి తమ యధికారము జరిగి తమ యిష్టానుసారము అనగా తమప్రజల యిష్టానుసారము తమప్రజల మేలుకే తీర్మానింపవచ్చుననియు నాశగాని ఐర్లాండుసభ్యులకు లేదు. అందుచేత ఐర్లాండుసభ్యులు ఎప్పుడును అధికారకక్షకు విరోధికక్షగా నుండవలసివచ్చు చుండినది. మాట సాగుబడియగుమార్గము లేమింజేసి వీరు తమప్రజల ఉత్తమప్రయోజనముకొరకు తీక్ష్ణపద్ధతు లవలంబించుటయు సంభవించినది. ఇందుచేత ఐర్లాండుసమస్య దినదినమును ఆంగ్లసామ్రాజ్యప్రభుత్వమునకు తీరువరాని సమస్య యాయినది. ఐర్లాండువారు కొందరు తమకు ప్రత్యేకత్వమే కావలయునని కోరువారును కొందరు బ్రిటిషు సామ్రాజ్యమున నంగీభూతమగు స్వరాజ్యము కోరువారును నైయుండిరి. బ్రిటిషు ప్రజాప్రభుత్వసభలో ప్రాతినిధ్యము దొరకియు నైర్లాండుచిక్కులలో బడి పరితపింపవలసియుండినది. కక్షలపోరాట మచ్చట హోరాహోరిగ జరుగవలసివచ్చినది. రహస్యముగా ఆయుధములు ఆయత్తముచేసికొని కక్ష లొండొంటిని సాధించుటకును ప్రభుత్వాధికారవర్గమును సాధించుటకును ప్రయత్నపడుట ఐర్లాండులో ప్రతిదినమును జరుగు నుద్యోగముగా పరిణమించినది. ప్రజలలో నొకపక్షమువారికే అధికారముకలుగునట్టి అవకాశముమాత్రమే కల్పితమైనప్పుడు ఇట్టిపరిణామము తప్పని సరియగును. అందులోను ఐర్లాండులోవలె అధికారవర్గమునకు నిరంకుశత్వముకూడ వల

వడియుండెనేని దుర్భరస్థితి యేర్పడకమానదు.

ప్రజాప్రభుత్వము బాగుగానమరి ఎల్లయభిప్రాయముల వారును అధికారమునకు వచ్చుమార్గము లేర్పడువరకును అనగా సంపూర్ణ ప్రజాపరిపాలనము సంస్థాపితమగువరకును "కక్షు"లను బహుజాగరూకతతో నేర్పరచవలసియుండును. ఏర్పరచిన తరువాతగూడ అంతియు జాగ్రత్తతో నడుపవలసియుండును.

<u>నాయకులు — అనర్థము:</u>—ప్రజావబోధము లేనికాలమున ఏయొక్కనాయకుడో యెక్కువసంఖ్యాకులగు జనమును కార్యకారణసంబంధముతో పనిలేక తనవెంటబెట్టుకొని ఇచ్చకువచ్చినరీతిని త్రిప్పగలవాడగునేని "కక్షు"లు మహానర్థకములగును. ఎల్లయ్య, వెంకయ్య, తిప్పయ్య లీరీతిని నాయకులైనయెడల వారివారి కలతలచే దేశక్షేమము అడుగంటును. జాతి, మత, సాంఘిక విభేదము లిట్టిసందర్భములలో దుర్వినియోగము చేయంబడవచ్చును. దేశలాభమునకు వ్యతిరేకులగు నిరంకుశాధికారు లీవిభేదములను పురస్కరించుకొని దేశమునందు కలతలు కల్గించి అభివృద్ధి నాటంకపరచుటకును ప్రయత్నించుట సంభవింపవచ్చును.

మనదేశములో ఇట్టి ప్రయత్నములు ప్రజాప్రభుత్వము వాసనయే లేనికాలమున చేయబడినవి. కొంతకాలము హిందూ మహమ్మదీయవైషమ్యములను అధికారులుగా నుండువారు కొందరు పెంచిరి. కాలక్రమమున హిందువులును మహమ్మదీయులును తాము పడుకడగండ్లను గుర్తించుటచేత ఈవైషమ్యము లిప్పుడు నశింపజొచ్చినవి. దేశీయమహాసభయు మహమ్మ

దీయమహాసభయు నైకకంఠ్యముగ భారతభూమి కంతటికిని నత్యవసరమగు స్వరాజ్యమును జాగుసేయక స్థాపించవలసిన దని కోరనారంభించినవి. హిందూమహమ్మదీయైక్యము సమకూరునప్పటికి ముఖ్యముగా మనరాజధానిలో కొందర రధికారులు బ్రాహ్మణబ్రాహ్మణేతరవిభేదములను పురికొల్పిరి. తమ ధర్మమును బ్రాహ్మణులు చక్కగా గురుతించి ప్రవర్తించిన యెడల ఈవిభేదమును త్వరలో నదృశ్యము కాగలదను చిన్నెలు కాన్పించుచున్నవి. అధికారమునసుండి నిరంకుశత్వమును వీడలేనివారలు ప్రజలలోగల జాతిమతసంఘవ్యత్యాసములను వినియోగించుకొనజూచుట సహజము. ఈయాధారములపై కక్ష లేర్పడుట ఇందువలన నపాయకరము. సాధ్యమైనంతవరకు అట్టి కక్షలేర్పడకుండ జేయుటకు సాధనము లాలోచించుటయే దేశక్షేమమును కోరువారు చేయదగినపని. కక్షలేర్పడనేని వాని వైషమ్యములు పెరుగకుండ జూచుటయు వారికి కర్తవ్యము. ఇందుకు సాధనము వేరొం డేదియులేదు. ఆమహానుభావుడు సర్ సయ్యదుఅహమ్మదు చెప్పినవాక్యములను స్మరింప జేయుటయే మొదటిమార్గము:

"హిందూమహమ్మదీయులు ఆత్మదేహములలో రెంటను నైక్యమును సంపాదించి ఐక్యముగా ప్రవర్తింపవలయును. అప్పుడే ఒక్కరికొక్కరు సహాయము చేసికొనవచ్చును. లేని యెడల ఒక్కరినొక్కరు ఎదుర్కొని ఇరువాగులవారి వినాశమునకు హేతుభూతులు కావలసివచ్చును. హిందూమహమ్మదీయసోదరులారా! మీరు అందరు నివసించునది హిందూ

దేశమేనా, మరియొక్కటియా? ఒకే భూమిని నివసించువారే కదా మీరు? ఒక్కటే భూమిని నడచి శ్రీమాతృగర్భమునుండియేగదా మీరు పోషితులగుచున్నారు. ...... మన మతవిషయక నమ్మకములేమి యనుప్రశ్న ముఖ్యముకాదు. మనమేకభూమినివాసులము, ఏకప్రభుత్వమున కంకితులము. లాభముకలిగిన అందరికి లాభము, దుర్భిక్షము పైబడిన నందరికి దుర్భిక్షమే. కాబట్టి మనమందరము మనకు సమానముగా తల్లిస్థానమునందు మాతృభూమికై యైక్యము నొందవలసినది."

భారతసందేశము:—భారతభూమిలో ముందుకాలములం దేర్పడిన పరిస్పర సహకారపద్ధతిని దేశమున నుత్తమమేధావంతు లైనటువంటివారు సంస్మరించుకొనుటే రెండవ మార్గము. ఈఋషిభూమిలో తీరరాని పోటీలకు తావులేదు. ఉత్తమజ్ఞానవంతుడైనవాడు సర్వమును త్యజించినను సర్వమును పాలించునను విశ్వాసము మెండు. మౌర్యసామ్రాజ్యస్థాపకుడు చాణక్యుడు రాజకీయాధికారము నాసించలేదు. మహారాష్ట్ర సంస్థాపనాచార్యుడు రామదాసు పదవులకై పాటుపడలేదు. విజయనగర మహారాజ్యనిర్మాత విద్యారణ్యుడు ప్రభుత్వోద్యోగములను బాటింపలేదు. ఇన్నిమాటలేల సర్వవిద్యాపారంగతుడైనవాడు సర్వాధికారదూరుడుగానుండియు సర్వాధికారధూర్వహుడగుట ఈదేశజీవితమునకు బునాది. ఇట్లగుట నీదేశమునందు మన ప్రత్యేకనాగరకమును ప్రత్యేకవికాసమును నశింపనంతకాలము తప్పడాధారములపై కక్షలేర్పడు

టయు లేనిపోనికలతలు తన్మూలకముగా పెరుగుటయు తట స్థింపరాదు.

<u>ముఖ్యప్రయోజనము ప్రజావబోధము</u>:—కక్షలవలని ప్రయోజనము లనేకములుగలవు. అందు ప్రజావబోధము ప్రథమగణ్యము. అందరును నేకమనస్కులై యుండు నప్పుడు తీక్ష్ణముగా కార్యములు సాగించుటకు తగిన యుద్దీపక ముండదు. భేదములు తోచినప్పుడే మానవుడు లోకమును తనపక్షమునకు ద్రిప్పుకొనవలయునను ప్రయత్నము కావించును. అప్పుడే ఆతని నిశ్చయతత్వము బయల్పడును అప్పుడే అతనిత్యాగమును, సాహసమును, సంకల్పదార్ఢ్యమును పరిస్ఫుటములగును. అనేకుల శక్తిసామర్థ్యములు వికసించి విజృంభించి లోకసేవకు సమర్పితములయినంగాని లోకమున విజ్ఞానవ్యాప్తి సంఘటిల్లదు.

రాజ్యము విస్తారమై ప్రజ బహుసంఖ్యాకమై యున్నప్పుడు నిజముగా ప్రజలందరకును రాజకీయవిషయములు తెలియవలయుననినను నెందరో యాత్సుక్యముతో బనిచేయవలసియుందురు. ఇక ఎల్లప్రజలును తమతమ యభిప్రాయమును ఆయావిషయమున నాయాసందర్భముల కనువగురీతిని తెలుపవలసియున్నయెడల జరుగవలసిన కార్యక్రమ మంతకంటె నెంతో యెక్కువ కావలసియుండును. కక్షు లేర్పడినప్పుడు ఈ రెండుపనులును జరుగుట కవకాశము కలుగుచున్నది. దానిని వినియోగించుకొనుటలోనే అన్నికక్షులవారి యోగ్యతయు బయల్పడవలసియున్నది.

<u>సంస్థల పరంపర:</u>— అందుచేతనే కక్షులు యథావిధిగ తమధర్మమును నెరవేర్చవలసియుండునేని ఒక్కొక్క కక్షను సంబంధించిన సంస్థలు దేశమంతటను వ్యాపింపవలసియున్నవి. వ్యాపింపక తీరదు. కక్షులు లేనప్పుడు "విషయము లేదో యొకదారిని నడుచుచున్నవి, మనకేల యీయుబుసు?" అని యెల్లరును నిద్రించిన నిద్రింతురు. కాని "కక్ష" లేర్పడిన పిదప "అదె, ఆవలివైపువారు ఆందోళన సాగించినారు. మన మూరకుందుమేని మనయాట సాగదు" అని యొక్కొక్క కక్షవారును తమతమ బలమును అభివృద్ధిచేసికొనుటకు ప్రయత్నింతురు. ఏదో నాల్గుదినములు పనిచేసినారముగదా విశ్రమింతమను ధోరణి నిజముగుకక్షులుగలచోట పొసగదు. నిరంతర మొక్కరి నొక్కరు కాచుకొనుటయే కక్షులకు కర్తవ్యమగుచున్నది.

నాగరకరాజ్యములలో "కక్ష"ల హడావుడి శాసనసభలకు సభ్యులను నిర్వచించు సమయమునను అంతకు కొంచెము ముందుగాను గోచరమగుచున్నది. ఏ పదిమందియో నిర్వాచకులైనప్పుడు ప్రతినిధిగా నుండగోరు అభ్యర్థి వారితో కలిసి వారిని చూచి సంప్రతించుకొని వారియంగీకారమును బడయుటకు అవకాశముండునేకాని నిర్వాచకులు వేలు లక్షలయినప్పుడు అట్టియవకాశము మృగ్యము. అభ్యర్థిపక్షమున అభ్యర్థి ఏ కక్షకుచేరినవాడో ఆ కక్షవారు పనిచేయుచుందురు. ఒకేకక్షకు చేరిన అభ్యర్థులు అనేకప్రదేశములకు సంబంధించి అనేకులు ఉండవచ్చునుగావున ఏ కక్షకాకక్ష జాగరూకమై ప్రజ

లకు తమ యభిప్రాయమును వివరించుచు ప్రజల యనురాగముకు సంపాదించుటకు ప్రయత్నింపవలసినదగుచున్నది. అనగా నొక్కొక కక్షకును కోస్తా కోస్తాలో, మండలము మండలములో, తాలూకా తాలూకాలో, గ్రామము గ్రామములో తగినసంస్థ లేర్పడితీరవలెను. ఏర్పడక తప్పదు. ఎంతత్వరగా నేర్పడి యెంత బలవత్తరముగా బనిచేసిన నంత ఆ కక్షకు విజయకారణము. ఈసూత్రము ననుకరించియే ఆంగ్లభూమిలోను అమెరికా సంయుక్తరాష్ట్రములలోను "కక్ష"ల యంగనిర్ణయ మేర్పడియున్నది. ఇందులోను ఈ రెండవరాజ్యమున నేర్పడియుండు సంస్థాపనాపరంపర యత్యుదాత్తము. దీనిని చూచియే యాంగ్లభూమియు సంస్థలనిర్మాణమును కైకొనినది.

<u>అమెరికా కక్షులు:</u>— అమెరికాలోను మరి యన్ని దేశములలోను కూడ "కక్ష"ల ప్రధానోద్దేశ మొక్కటే. రాజ్యాంగములలో ముఖ్యతమాంగమగు శాసననిర్మాణసభకు సభ్యులను పేర్కొని నియమించుట మొదటిపని. కార్యనిర్వాహకవర్గము ఈ శాసనసభలోనివారి నియామకముచేతనే యేర్పడుటచేత స్వపరిపాలితరాష్ట్రములలో "కక్ష"లకు ఇంతకంటెను గమనింపదగినవిషయ మింకొకటి లేదనుట స్పష్టము. "కక్షి"అనగానేమో మన కిదివరలోనే తెలియును. దేశమునకు ఇట్టి ఇట్టి పద్ధతులు శుభావహములని నిశ్చయించి యిట్టియిట్టి సిద్ధాంతములు అనుకరణీయములని నిర్ణయించి ఈసిద్ధాంతములను ఆపద్ధతులను సాగించుటచే సాధించుటకు సర్వప్రయత్నములు చేయుటకు కంకణబద్ధులైన ప్రజలసంఘమును "కక్షి"

యీనుచున్నాము. ఏకక్షియైనను తనసిద్ధాంతము లంగీకృత ములు కావలయుననునెడల తనపద్ధతు లవలంబింపబడవలయు ననిన తనపక్షమునకు చేరినవారినే శాసననిర్మాతలుగను కార్యనిర్వాహకులుగను నియోగింపవలెను. తనపక్షమువారే నిర్వాచితులు కావలయునని ఆలోచించునెడల ఒక్కొక "కక్షి" కిని తగినంత ప్రజాబలము అవసరమగుచున్నది. తన "కక్షి"కి చేరినవారినే నియమించి "పరిపాలన"లో ఉత్తమమైన పలుకు బడి కలుగచేసికొనవలెనను అభిలాషయే అమెరికాలో మహా త్తమమైన "సంస్థా" పరంపరను నిర్మించి దాని కఖండతేజమును సంపాదించియున్నది.

నిర్వాచనములలో విజయవంతమగుటకు అమెరికాలోని "కక్షు"లెట్లు పనిచేయుచున్నవో చూడుడు!

మొట్టమొదట:—ఒక్కొక కక్షియు నిర్వాచకునికి అనగా ౨౧ సంవత్సరములు నిండిన ప్రతిపురుషునకును కొన్ని కొన్నిచోట్ల అదే వయస్సునిండిన ప్రతిస్త్రీకిని, దేశమునకు సంబంధించిన ముఖ్యవిషయము లన్నిటిని గురించియు సంగ తులు తెలియజేయుచున్నది. వివాదాంశములు కలయప్పుడు సిద్ధాంతరాద్ధాంతములను రెంటిని వినిపించుచున్నది. ఏకక్షికి తగినరీతిని ఆకక్షి తనవాదమును తాను బలపరచుకొనుననుటకు సందియములేదు. అయిన ప్రజ ఒక్క పక్షమువారిమాటలే వినవలయునను నిర్బంధమేమియు లేదు. ఇరుపక్షములవారును చేయు నుపన్యాసములను వినవచ్చును. వ్రాయువ్రాతలను చదువవచ్చును. సిద్ధాంతరాద్ధాంతములను రెంటిని సమగ్ర

ముగా తెలిసికొనవచ్చును. ఈవిధముగా "కక్షి" కి చెందిన వారు నిర్వాచకుని జాగ్రదవస్థయం దుంచుట "కక్షి"కి చేసికొనిన యుపకారముమాత్రి మనరాదు. ఇది రాజ్యమునకు చేసిన యుపకారమనుట నిస్సంశయము. "సమ్మతి" ఇయ్యవలసినవాడగు నిర్వాచకుడు కనుబరచు వికాసము సామాన్యముగా "కక్ష"లకు చేరిన వక్తలను వినుటవలనను వారు వ్రాసిన పత్రికలను మొదలగువానిని చదువుటవలనను గలిగినదనుట నిజము.

రెండవది:—నిర్వాచనములు జరుగు సమయమునకు "కక్షి" నిర్వాచకులనందరిని ఉత్సాహపూరితులను చేసి నిర్వాచనమున గట్టిగా పాల్గొనునట్లు చేయుచున్నది. సభలు పుష్కలముగా జరుపుటచేతను ఉపన్యాసములు పుంఖానుపుంఖములుగా కురిపించుటచేతను ధ్వజములు పతాకములు ఇత్యాదులను ప్రదర్శించి ఉత్సవములు ఊరేగింపులు జరుపుటచేతను "కక్ష"లు తమతమ యభ్యర్థుల యెడల ప్రజలలో నుద్రేకము పురికొల్పుటకు ప్రయత్నించును. ఇదియు "కక్ష" లకుమాత్రము చేసికొనినసేవ కాదు. ఇది రాజ్యమునకు చేసిన సేవయే. ఎందులకందురా? ప్రజాపరిపాలనకు ముఖ్యమైన యాధారము ప్రజాసంకల్పము. ప్రజాసంకల్పము ఎంతసూక్ష్మముగా పరిస్ఫుటమైన నంత యెక్కువగా ప్రజాపరిపాలనమువలసఫలము సంపాదితమగును. "కక్ష"లపరిశ్రమ నిర్వాచకులు నిర్వాచకస్థానమునకు పోయి వారివారి యంగీకారము సూచించుటకు తోడ్ప

డుటచేత ప్రజా సంకల్పమును ఈ కక్షులు ప్రకటింపించుచున్న వనుట విదితము.

మూడవది:— ఒక్కొక్క కక్షియు సంవత్సరము సంవత్సరము, సంవత్సరము సంవత్సర మననేల, నిరంతరమును క్రొత్తసభ్యులను చేర్చుకొనుటకు ప్రయత్నము చేయుచుండును. అనగా, ఏనాడెవ్వరికి ౨౧ సంవత్సరముల వయసు నిండినదో ఏనాడెవ్వడు పౌరత్వమున కర్హుడైనాడో కనిపెట్టియుండి ఆ వ్యక్తిని తన పక్షమునకు చేర్చుకొనజూచుచుండును. అన్ని "కక్షు" లవారును ఈ ప్రయత్నము చేయుచునే యుండుటచేత నెన్నివిధములుగా దేశమున విజ్ఞానము వ్యాపించుటకు అవకాశ మున్నదో ఎన్నివిధములుగా నిర్వాచకుడు సంగతులెఱింగికొని వికాసవంతుడగుటకు అనుకూల్యము కలదో సులభముగా నూహించుకొనవచ్చును.

తన రాజకీయమతము వారిని నియోగించుకొని వారి మూలకముగా రాజ్యాధికారము రాజ్యకార్యనిర్వాహణమును తనయుద్దేశమున నుంచుకొను నేకోద్దేశముతో ఒక్కొక్క కక్షియు నిర్వాచకవర్గమునకు సంగతులను తెలియజెప్పుచు నిర్వాచనకాలమందు నిర్వాచకులను నుత్సాహపూరితులుగను నుదేక వంతులుగను చేయుచు అహరహము దేశములోని ప్రజయందలి ఒక్కొక్క వ్యక్తిని తన పక్షమునకు త్రిప్పికొనుటకు తగినంత యాందోళనచేయుచు ప్రయత్నపడుచున్నది.

'కక్షుల' సంస్థాపరంపరసంపూర్ణరీతిని సంపూర్ణశక్తితో నేర్పడియుండు దేశము పేర్కొనవలసినచో అన్నిటికంటె మిన్నగా 'అమెరికాసంయుక్తరాష్ట్రము'నే పేర్కొనవలసియున్నది. మూడుమాటలలో నాపరంపరను వర్ణింపదలచినచో దానినంతయు నొక్కత్రికోణాకృతిగల మహాపర్వతమునకు బోల్పవచ్చును. శిఖరమున "సర్వరాష్ట్రీయసభ" గలదు. దీనినే అమెరికాలో ఆంగ్లభాషలో 'నేషనల్ కన్వెన్షన్' అందురు. పదమున 'మూలసంఘము' లుండును. వీనినే అమెరికాలో ఆంగ్లభాషలో 'ప్రైమరీసు' అందురు. అమెరికా రాజ్యము రాజ్యాంగకార్యములకయి 'సంయుక్తరాష్ట్రము' 'రాష్ట్రములు' 'మండలములు' 'ఉపమండలములు 'ప్రాంతములు' అని విభాగితమై యున్నది. కట్టకడపటి విభాగమునందు నివసించుచు పౌరత్వమున కర్హుడైనవాడొక్కొక్కడును తానేకక్షికి చేరినవాడో ఆకక్షికి సంబంధించిన మూలసంఘమునందు చేరనర్హుడు. ఆసంఘమునకు విధాయకకృత్యములివి:

(౧) ఆప్రాంతములోని ఎల్ల అధికారములకు ఈయీవారు తగుదురని తమపక్షమునుండి అభ్యర్థులను నియమించుట.

(౨) "కక్షికి" సంబంధించి యెల్లకార్యములను ఆప్రాంతమున నిర్వహించుటకు "కార్యనిర్వాహకసంఘము" ను ఎన్నుకొనుట.

(౩) ప్రాంతమేమండలమునందు విభాగమో ఆమండలము

సకు సంఘముగానేర్పడి పనిచేయుటకు తగిన ప్రతినిధులను నియమించుట.

ఈప్రాంత మింతపరిమితికలదని యర్థముచేసికొనుట కొంతవరకు మనకు సహకారి. సంయుక్తరాష్ట్రములోని పెద్ద విభాగములగు రాష్ట్రములే అనేకములు మనమండలములయంతలేవు. మన నెల్లూరుమండలము ౭౯౨౩ చతురపుమైళ్ల వైశాల్యముకలది. ౧౩,౨౫,౧౪౨ జనసంఖ్యకలది. * అమెరికా సంయుక్తరాష్ట్రములలో "డిలవేరు" అను రాష్ట్రము ౨౦౪౦ చతురపుమైళ్ల వైశాల్యము కలది. ౨,౦౨, ౩౨౨ జనసంఖ్య కలదు.* ఈ రాష్ట్రము సర్వరాష్ట్రవిషయములలోదక్క సంపూర్ణ స్వాతంత్ర్యముకలదైయున్నది. ఇట్టిరాష్ట్రములో మండలములు ఉపమండలములు ప్రాంతములు అనిన నెంతస్వల్ప విభాగమో గురుతించుట కష్టముగాదు. రమారమి రాష్ట్రముల యంతటి సర్వాధికారముకల మండలములును గలవు. అందులో "కొలంబియా"యనునదొక్కటికలదు. దీని విస్తీర్ణము డెబ్బది చదరపుమైళ్ళు మాత్రము. ఈకథయంతయు నేలయని చదువరులు విసుగవలదు. అమెరికాలో సంస్థాపనాపరంపరకు బునాదియగు ప్రాంతమెంత స్వల్పవిస్తీర్ణముకలదియో సూచించుటకిది యెల్లయు నవసరమైనది.

ఇట్టి ప్రాంతములచే బేర్కొనబడిన ప్రతినిధులు విస్తారతరమగు మండలమునకు జేరిన సంఘములో సభ్యులుగానుండి ప్రాంతసంఘము ప్రాంతము విషయములలో నెరవేర్చు

---

* ఈఅంకెలు ౧౯౧౧సం॥ మునకు సంబంధించినవి.

విధుల నన్నిటిని మండలవిషయములలో నెరవేర్చుచున్నారు. ఇదేరీతిని మండలసంఘములనుండి యేర్పడిన ప్రతినిధులు రాష్ట్రసంఘములుగను రాష్ట్రసంఘములనుండి యేర్పడిన ప్రతినిధులు నాషనల్ కన్వెన్షను గను ఏర్పడుచున్నారు. రాష్ట్రసంఘములోని ప్రతినిధులు గవర్నరు, లెఫ్టినెంటుగవర్నరు — ఈ హోదాలకు తమకక్షికి చేరినవారిలోనుండి అభ్యర్థులను పేర్కొని వారికిగాను దేశసమ్మతిని సాధింపజూతురు. నాషనల్ కన్వెన్షన్ లేక సర్వరాష్ట్రీయసభవారు "కక్షి"కి సంబంధించిన సిద్ధాంతములను పద్ధతులను నిర్ణయించుటకును అమెరికా దేశాధ్యక్షపదవికిని ఉపాధ్యక్షపదవికిని తమకు న్యాయమని తోచిన యభ్యర్థులను నియమించుటకును సంయుక్త రాష్ట్రములలో అంతట జరుగవలసిన యభిప్రాయవ్యాపనమునకు నుచితమగు ఏర్పాటులు చేయుటకును నర్హులైయుందురు. ప్రత్యేకరాష్ట్రములచేతను మండలములచేతను నిర్వచితులైన ౫౧రు సభ్యులు ఈసర్వరాష్ట్రీయసభకు కార్యనిర్వాహకసంఘముగా నేర్పడుదురు.

పైవర్ణననుబట్టి ఒక్కవిషయము స్పష్టమగుచున్నది. అమెరికాలో ఏ 'కక్షి' కాకక్ష పూర్తిగా పల్లెటూరివరకును పాకియున్నది. ప్రతినిర్వాచకుడును ఏదో యొక 'కక్ష'కు చేరుచున్నాడు. ప్రాంతాధికారులు మొదలు అధ్యక్షునివరకుంగల యధికారులను తానే స్వయముగనో ప్రతినిధుల మూలకముగనో నియమించుటకు ప్రయత్నించుచున్నాడు. శాసనసభకుగాని అధికారపదవులకుగాని నేను నేనని ఎవ్వడును తనంతట తాను

ముందుపడి వచ్చుటకు లేదు. ప్రజలు ఈతను తగినవాడని నిర్ణయించినంగాని ఆయాపదవులకు అర్హుడనని యైనను నెవ్వరును ప్రకటించుకొనుటకు రాదు.

ఇంతసంపూర్ణముగా ప్రజాధీనముగ నభ్యర్థు లుండవలసి వచ్చుట మరియేదేశమునను నున్నదని చెప్పుటకురాదు. ఇప్పుడిప్పుడు కొద్దిగకొద్దిగ ఆంగ్లసీమలో నీపద్ధతి ప్రాకుచున్నది. ఇదివఱకును ప్రజాప్రతినిధిసభలో సభ్యులుగానుండ నర్థించువారు తమకుగల హక్కులను విప్పిచెప్పుకొని తమకు సంఘములోగలపలుకుబడిని అంతస్థును ఆధారముచేసికొని తాము అభ్యర్థులుగానుందుమని ప్రకటించుకొనుచుందురు. ఇదియే యిప్పటికిని ఇంకను ఐరోపాలో పరాసుభూమిలోను ఇతర రాజ్యములలోను ఆచారమైయున్నది. మనదేశములోను ఇట్టి యాచారము నేడు అమలులోనికి వచ్చుచున్నది. మరియొక యాచారమును గమనింపనగును. సంఘములో కొంచెము ప్రముఖులైనట్టివారు ఏవారినో తమకు ఇష్టమువచ్చినవారిని పేర్కొనుటయు వారు అభ్యర్థులుగా నంగీకృతులగుటయు జరుగుచున్నది. మనపట్టణపాలకసంఘములలో ఎన్నికలలోను ఇతరమగు ఎన్నికలలోను దీనిని 'నామినేషను' అనుచున్నారు. ఇది నిజమైన 'నామినేషను' అనగా 'పేర్కొనుట' కాజాలదు. అమెరికాలోని 'పేర్కొనుట'యే పేర్కొనుట. అది ప్రజల 'పేర్కొనుట' ఇది కొందర, పేర్కొనుట. కొందర 'పేర్కొనుట' కొందరలాభమే సాధారణముగా గణ్యమగును. ప్రజల 'పేర్కొనుట' లో అనేకులలాభము గణ్యమగును. కాబట్టి

ప్రజల సహాయమునుతీసికొని వారిచే పేర్కొనబడక స్వయముగా నేను కలను, నేను కలనని బయల్పడువాడును ఎవ్వరో కొందరిచే పేర్కొనబడువాడును ఇరువురును అభ్యర్థులుగా నంగీకృతులగుట లేదు.

ప్రజాసంకల్పము నింతటి దార్ఢ్యముతో వెలిబుచ్చున దగుటచేత 'కక్షి' అమెరికాలోనేమి ఇతర నాగరకరాష్ట్రములలోనేమి ప్రభుత్వములో భాగము కాకున్నను ప్రభుత్వమునకు పరమాధారముగా పరిగణింపబడుచున్నది. ఇంతటి మహాహార్మ్యమునకు బునాదియగు 'మూలసంఘము'ల స్వాతంత్ర్య సంరక్షణమే 'కక్షి'యొక్క ధర్మనిర్వాహణమునకు ఆధారమనుట స్వయంప్రకాశము. ఆస్వాతంత్ర్యమునకు కొన్ని లోపములు కలుగుటయు సంస్కారములు జరుగుటయు అమెరికా చరిత్రమునందు కానవచ్చుచున్నది. 'కక్షి' 'కక్షి'యని నోరెత్తి పల్కువారందరును ఈ అమెరికాకక్షుల చరిత్రం దిలకించి కక్షులను తమ స్వప్రయోజన స్వోత్కర్షలకుగాక దేశక్షేమమునకు వినియోగించవలసి యుందురు. 'కక్షి' పేరు పెట్టి ఎవ్వరోబలవంతులు నియామకములు చేయుటయు వారి యనుచరులు సెబాసనుటయు జరిగెనేని మహానర్థములు వాటిల్లక తప్పదు.

సంపూర్ణప్రజాప్రభుత్వములు వెలసిన దేశములలో 'కక్షులు' అధికారుల నియామకాది విషయములలోమాత్రమేకాక మరియొక విధముగను ఉపయోగకరములగుచున్నవి. ప్రజాప్రభుత్వమనుటతోడనే స్థానికస్వాతంత్ర్యము మిక్కిలి

యెక్కువయగుట యనునదిఫలమగుచున్నది అందువలన అమెరికాసంయుక్తరాష్ట్రములవంటి విస్తారతరరాజ్యములలో స్థానికస్వాతంత్ర్యము లెక్కువయైపోయి సంయుక్త ప్రభుత్వములును స్థానికప్రభుత్వములును కొన్నికొన్ని సామాన్య విషయములలో భిన్నముగా ప్రవర్తించి ఏకత్వము వ్యాపింపవలసినచోట అనేకత్వమును కలిగించుటయు సంభవింపవచ్చును. ఉదాహరణార్థము విద్యాపద్ధతులనే స్వీకరింతము. విద్యాపద్ధతులలో స్థానికస్వాతంత్ర్యము అవసరమే. కాని దేశమునకంతటికిని సంబంధించి యొకవిధమగు నైక్యముకూడ నవసరమే. అమెరికాలో నిట్టియైక్యమును ఈ‘కక్షి’పద్ధతి కాపాడుచున్నది. ‘కక్షి’ యొక్క రాష్ట్రమునకు సంబంధించిన సంస్థకాదు. ఎల్లరాష్ట్రములకును నైక్యము కలిగించుసంస్థ. కాబట్టి ‘కక్షి” యొక్కయభిప్రాయములు రాష్ట్రరాష్ట్రమునకువ్యాపించి రాష్ట్రప్రభుత్వముల నిర్ణయములను ప్రజాభిప్రాయానుగుణము కావించుచుండును.

## నేరుగా జొరఁబడుట.

నాగరికరాష్ట్రములలో నిర్వాచకవర్గమువారు ప్రభుత్వమును స్వాధీనము చేసికొనుటకును, ప్రభుత్వమున పలుకుబడి సంపాదించుటకును పైనివివరించిన మార్గములను స్థాపించుకొనుటే కాక ఇంకనుకొన్నిమార్గములు వెదకుకొనినారు. స్వయముగా జొరబడి శాసననిర్మాణమార్గమును మార్చుటకు ప్రజ కొన్నికొన్ని నాగరికరాష్ట్రములలో అధికారము పెట్టుకొనినారు. మూడువిధానముల నిట వివరించెదము.

(౧) నిర్వాచకులలో నియమితసంఖ్యాకులు చేరి ఇట్టివిధ మగు శాసనమును మీరు చేసి ప్రజాభిప్రాయము కనుగొనవలసినదని శాసనసభవారికి మనవి అర్జీమూలకముగా తెలుపవచ్చును. అందులోను కొన్నిప్రదేశములలో నియమితసంఖ్యాకులగువారు తమకు కావలసిన శాసనమును అక్షరమక్షరము సిద్ధముచేసి ప్రజలయభిప్రాయము దీనిని గురించి కనుగొనవలసినదని శాసనసభవారిని కోరవచ్చును. శాసనసభవారు కనుగొనక తప్పదు. ఈవిధానమునకు "ఉపక్రమా"ధికారమని పేరు.

(౨) ఏదైనను శాసనముకాని రాజ్యాంగనిర్ణయమునకు సంబంధించిన సవరణముకాని విమర్శలో నున్నప్పుడు అట్టిదానికి ప్రజలయంగీకారము తీసికొనవలసినదని కోరబడవచ్చును. అప్పుడు శాసనసభవారు అంగీకారము తీసికొనవలసి యుందురు. ప్రజలలో ఎక్కువసంఖ్యాకు లేతీరుగ తీర్మానము చేయుదురో ఆతీరుగ శాసనసభవారు అంగీకరింపక తప్పదు. శాసనసభవారు కొన్నివిషయములలో ఇట్టి అంగీకారము తీసికొని తీరవలయును. కొన్ని సందర్భములలో నియ్యది శాసనసభవారి ఇష్టానుసారము నిర్ణయింపబడవచ్చును. ఈపద్ధతిని 'అభిప్రాయాధికార' పద్ధతి యనవచ్చును.

(౩) కొన్నికొన్ని సందర్భములలో ప్రభుత్వాధికారమునందున్నట్టి 'కక్షి'వారు తాముచేయుకార్యక్రమమునకు ప్రజానుమతి కలదో లేదో యెరుంగుటకు ప్రజలయభిప్రాయము నడుగవచ్చును. ప్రజ లభిప్రాయమిత్తురుగాని తదనుసారముగ

ప్రభుత్వమున నుండువారు నడచియే తీరవలయునను నిర్బంధము లేదు. వారికిది హెచ్చరికమాత్రముగ గ్రహింపనగును. ఈవిధానమును 'అభిప్రాయప్రకటన' విధానమనవచ్చును.

పూర్ణఫల మెప్పుడు?—నేరుగా నిర్వాచకులు జారబడు నీపద్ధతులు స్వల్పభూమిలో నిర్వాచకవర్గము కొలదిగా నున్నప్పుడు పూర్ణఫలవంతము లగును. కాబట్టి మొట్టమొదట నివి స్విట్జర్లాండులో నెక్కువగా ప్రచారమునకు వచ్చినవి. రానురాను రాకపోకలు సులభతరములగుచున్నందున విస్తారతరరాష్ట్రములలోను ఈవిధానములు కొంతవరకు వ్యాపించుటకు అవకాశము కలిగినది. ఇప్పుడిప్పుడు అమెరికాసంయుక్తరాష్ట్రములలో ఈవిధానము లొక కొంతమట్టుకు అనుసరింపబడుచున్నవి.

'నేరుగా జారబడు' విధానములు ప్రాతినిధ్యపద్ధతిలో కన్పించు లోపములను చక్కబెట్టుటకు నేర్పడినవి. ప్రతినిధులెచ్చుట పొరబడిన నచ్చట ప్రజలు తమ యభిప్రాయమును ప్రవర్తింపచేసికొనుట కీవిధానములు పనికివచ్చును.

సంపూర్ణముగా ప్రజలయధికారము ప్రబలినచోట వారేర్పరచిపంపిన ప్రతినిధులనే అధీనమునందుంచుకొనుటకు వారు విధానములను నిర్ణయించుకొనవలసివచ్చుచున్నదనుట ఇందువలన స్పష్టము. ఇంత జాగ్రత్తపడిననే ప్రజాప్రభుత్వము పరిపూర్ణము కాదనినప్పుడు వోటునకు నిజమైనయర్థమును బలమును కలుగదనినప్పుడు మనమిచ్చు పన్నులమీద మన కధికారములేక అధికారులకిచ్చు వేలనేల జీతములమీద మన

నేరుగా జోడించబడుట.

కధికారము లేక సైన్యముమీద కర్చుపడు కోట్లకొలది వ్యయ
ములమీద మనకధికారము లేక మనము నియమించిన ప్రతినిధు
లలోనుండి ఏర్పడు మంత్రులకు వారిక్రిందియధికారులను —
విద్యాశాఖాధికారివంటివారికి — పదిరూపాయలు జరిమానా
వేసి శిక్షించుమాత్రమైనను యాజమాన్యము లేక పరాభవ
ముల పాలుచేయుచుండు మనవారలు ప్రజాప్రభుత్వమును
స్థాపించుచున్నదనిన నెంత విచిత్రము దీనికి కల్పితమగు
చున్నదో చదువరులే సులభముగా గ్రహింపగలరు.



# అనుబంధము.



నేడు ప్రపంచము సంచలప్రేరితమయి యున్నది. ఇందులకు కారణము దూర మరయ నక్కరలేదు. భౌతికసౌఖ్యము లందవలయుననుటయే మానవుని పరమావధి. ఈ పరమావధి కంటియెదుట నున్నంతకాలమును పరస్పరము పోటీపడి ఒకరి నొక్కరు లోఁగదీసికొనుటకు ఉపాయములు వెదుకుటయే కార్యపరత్వ మగుచున్నది. పాశ్చాత్యరాష్ట్రములు ఈదినము లోకమున గణ్యములుగదా! వీని జీవితమును నడుపుచుండు మహాశక్తి యెయ్యది? క్రైస్తవమతాధారంబగు ఆ బైబిలుగ్రంథమా? దాని నేనాఁడో పాశ్చాత్యులు సముద్రమున పడవైచినారు. దానితోఁగూడ క్రీస్తుమహాపురుషుని మానవప్రపంచమధ్యమునుండి గెంటివేసినారు. బైబిలుస్థానమున అర్థశాస్త్రమును ఉత్తమపీఠము నలంకరింపజేసినారు అందలి సిద్ధాంతములను అఖిలజీవితమునకును ఆధారముచేసినారు. మానవు డెన్ని ఆశలు పెంచుకొనిన నంత నాగరికుడను భావము ప్రపంచమున కెక్కజూచినారు.

ఆశపోతున కాశపోతు శత్రువు. "యాచకో యాచకశ్శత్రుః" అనియుండ దీనిని బలపరచుటకు వాదములుకూడ నేల? ఆశలసిద్ధాంత మల్లుకొనినకొలది మానవునకు మానవుడు జాతికి జాతి శత్రుత్వము వహింపవలసివచ్చినది.

యజమాని తనకుగల పలుకుబడిచేత, తనకుగల ధనసంపత్తిచేత అపరిమితమయిన విషయసౌఖ్యము లనుభవించుచున్నాడు. తనపనివాడు ఎన్ని రెప్పలపాటు పని చేసినాఁడో కనిపెట్టి రెప్పపాటు కెన్ని దమ్మిడీలని లెక్కవేసి కూలి తీర్మానించు

చున్నాడు. కూలివాడనిన నతనికి పట్టి యంత్రముతో సమానము. ఇంటికడ బిడ్డ కనారోగ్యముగానున్నను, భార్యచచ్చుచున్నను, తలిదండ్రులు అన్నదమ్ములు అక్కచెల్లెండ్రు కలహించుచున్నను కూలివాని మనస్సుచెదరరాదు. అతనిచేయి సడలరాదు. అతడు చేయునట్టిపని కొరవడరాదు. యజమాని లాభము తగ్గరాదు. ఇతని మోటారుబండికి చెల్లవలసిన గబ్బునూనె ఒక్కతులమయినను తీసిపోరాదు. ఇంత జరిగినదిపో. ప్రజలు మొత్తముమీద సౌఖ్యపడుటకు కావలసిన సత్రములు, గుళ్లు, గోపురములు, ఆరామములు ఇత్యాదులు పెరుగుచున్నవాయనిన అట్టిపాపము ప్రబలుట లేదు సరికదా ఆపాపమున కొడిగట్ట తలపెట్టువారును తక్కువైనారు. ఏలయందురా? ఎంతటి ధనవంతునికిని నేటిదినము అతనిసంపద యంతయు అతని యనుభోగములకే చాలుటలేదు. ఇట్లగుటచేత కూలివారిలో అసంతృప్తి జనించుటలో విపరీతములేదు. కష్టము చేయునట్టి తాము సంపాదించినది సోమరిపోతులగు యజమానులు అనుభవించుట వీరికి గిట్టకపోవుటలో వైపరీత్యములేదు. యజమానులు పొందు భౌతికసౌఖ్యములలో వీరు కొన్నిటిని పొందనిచ్చగించుటలో విచిత్రమేమియులేదు. యజమాని పనివారల సంఘర్షణ పాశ్చాత్యప్రపంచమును ముంచివేయుటలో అస్వాభావికమేమియులేదు. డుల్లిన తలలు, విరిగినకాళ్ళు, పగిలినయంత్రములు, మండినఇండ్లు, కాలిన కడుపులు, కూలిన సంసారములు, చెదరినమానసములునై పాశ్చాత్యజీవితము భీభత్సరసపరిపూర్ణమయియుండుటలో నసహజమేమియులేదు.

యజమానులు కూలివారలకు కలుగు పోరాటమేబీదలు

భాగ్యవంతుల పోరాటము. దీనిని ప్రత్యేకించి వర్ణింప వలసిన యవసరము కన్పింపదు.

వ్యక్తులలో కలిగిన వికారమే ఆశల సిద్ధాంతముచేత సంఘములలోను కలిగినది. జాతులలోను కలిగినది. జాతుల వైషమ్యమునకు పోటీలకు పోరాటములకు ఈవికారము కారణభూతమయినది. మహాయుద్ధములకు ప్రజానాశమునకు ద్రవ్యనాశనమునకు సౌఖ్యనాశనమునకు శాంతినాశనమునకు ఇది హేతుభూత మయినది. ఈ విషయవివరణమంతయు నప్రస్తుతము. కాని రాష్ట్రప్రభుత్వములలో ఇది యెట్టి పరిణామమును కలిగించినదో విమర్శించుట కర్తవ్యము.

మితిలేని విషయసౌఖ్య మనుభవింప దలంచువాడు ఇతరుల నణంచి తీరవలయును. ఇతరుల స్వత్వములను హరించి తీరవలయును. ఇతరుల సౌఖ్యముల కడ్డు దగిలితీరవలెను. అతనికి సత్య మడ్డము కారాదు. ధర్మ మాటంకము కారాదు. జీవకారుణ్యము నిరోధము కారాదు. ఇవి యాతని ప్రవర్తనకు సూత్రములుకావు. కాబట్టియే మితిలేని సౌఖ్యములే మానవపరమావధియని యంగీకరించిన నేటి నాగరకరాష్ట్రముల ప్రవర్తనకును ఈయవి సూత్రములు కాలేదు. నేటి రాజ్యముల జీవితమునకు మానవుల ప్రాణములను తమకు స్వాధీనముచేయు గుండ్లు, ఫిరంగులు, సైన్యములు, ఆకాశవిమానములు, జలాంతర్గాములు, విషవాయువులు ఇవియే యాధారములు. వీనినే నేటిదినమున రాజ్యకార్యనిర్వాహకులు—ఉత్తమప్రజాపరిపాలిత రాష్ట్రములలోగూడ—ప్రజల "వోటు"మూలకముగా స్వాధీనము చేసికొనజూచుచుండుట. బహుజనముల వోటు

ఈ కారణముచేతనే కొందరు వశపరుచుకొనుప్రయత్నము అను దినము జరుగుచుండుట. విషయసౌఖ్యములకు—అర్థములేని విషయాడంబరములకు—కాలగతిని నలవాటుపడిన బీదసాదలు తమ పేదరికము కారణముగనే, ఆశలుకారణముగనే, ఆత్మబలహీనత్వము కారణముగనే, తమకు క్షుద్రసౌఖ్యములను తాత్కాలికముగా, మెరుపుతీగెవలె చూపగల ద్రవ్యవంతులకు యజమానులకు, పలుకుబడికల పెద్దలకు—మనసులో వారిని దూరుచునే, దూషించుచునే, తమగతికి కుందుచునే, క్రుంగుచునే,—తమవోటుల నిచ్చివేసి తమ్మును తాము బంధించుకొనుచున్నారు. బలవంతుల గుండ్లకు మందుకు రాకుసి ద్రవ్యమునకు తమ్మును తామే దాసులను చేసికొనుచున్నారు.

ఇంగ్లండుదేశముయొక్క దృష్టాంతమునే యాలోచింతము. ఆ దేశమున నెక్కువగా వోటు కలవారెవ్వరు? సామాన్యకర్మకరులు, సాధారణులగు బీదజనులు. కాని రాజ్య పరిపాలన చేయువారెవ్వరు? సాధారణ కర్మకరులుకారు. సామాన్యులగు బీదసాదలుకాదు. పలుకుబడికల ధనవంతులు. హర్మ్యములలో నివసించు నధికారులు. బీదసాదలు విషయ సౌఖ్యమును పరమావధిగా నాలోచించుటచే బలవంతుల మందుగుండ్లకు భీతి నందుటచే నీదురవస్థ కలుగుచున్నది. నేడు బహుసంఖ్యాకులకీగతి. వారి వోటుల కీపరిణామము. రేపు ఈ బహుసంఖ్యాకుల చేతికే మందుగుండ్లబలము—రుష్యాలో దొరకినట్లు—దొరకిన దనుకొందము. అప్పుడు స్వల్పసంఖ్యాకులగతి యేమగును? రుష్యాలోనైన దేకాని వేరుకాదు. స్వల్పసంఖ్యాకులు అనంరక్షితులే? కాబట్టి వోటున కర్థమేమి

కలదు? వోటునకుగల నైతికబల మేమికలదు? వోటు చేసిన నిర్ణయ మేమికలదు? తాను విషయాశలలోబడి తనసోదరులకు విషయాశలు కల్పించి ఏవాడు మారణయంత్రములను స్థాపనను చేసికొనగలడో వాడు—లేకున్న నాతగ—రాజ్యకార్యధూర్వహుడగుచున్నాడు. అంతియేకాని నిజముగ 'వోటు'నకిప్పటి పరిస్థితులలో జాతి స్వయంనిర్ణయమును సూచించు సత్తువ లేనే లేదు. స్వల్పసంఖ్యాకులను సంరక్షించు బలము లేనే లేదు. సత్యధర్మములను స్థాపించుశక్తి అంతకుముందే లేదు. కాబట్టియే లోకశాంతికి, లోకకల్యాణమునకు ఈవోటు ఆధారము కాలేకయున్నది.

అయిన సృష్టిలో మానవుని హృదయమునుండి సత్యము, ధర్మము, శాంతి, జీవకారుణ్యము అదృశ్యము లయిపోయినవా? ప్రపంచమునకు మోక్షము లేనే లేదా?

నిజ మరయుగా ప్రతిజీవియు ఒకప్పుడు కాకున్న నొకప్పుడైనను లోకశాంతిని కోరువాడేకాని వేరుకాదు. సర్వజనులు సుఖంబుండుటకు మార్గ మాలోచించువాడే కాని యాలోచింపనివాడు కాడు. ఎంతటి తామసప్రకృతి కలవాడైనను ఎట్టి దుష్కార్యములు చేయువాడైనను మానవుడు లోకకల్యాణమును కోరి చేయుచున్నట్లు నటించుచున్నాడేకాని తన దుష్టప్రకృతిచేత చేయుచున్నాడని యనుకొనుట లేదు.

వ్యక్తులు తమ స్వసంతోషమునకయియే తాము చేయు కర్మ చేయుచున్నా మనువా రుండిన నుండురు కాబోలును. కాని సంఘములు తమ లాభమాత్రమునకయి తాము కర్మచేయుచున్నట్లు అంగీకరించుట సాధారణముగా కానరాదు. అందు

లోను నాగరికులమని ముందంజవేయు మహాజనము లెవ్వరును ప్రపంచసౌఖ్యము దప్ప నింకొక యుద్దేశము తమకు గలదని తలంపనైన తలంపనొల్లరు. మహాసంగ్రామములోనికి ఇంగ్లండు దిగినదనిన బెల్జియమును సంరక్షించుటకే. అమెరికా ఫిలిప్పైను దీవుల నేలినదనిన ఆద్వీపవాసులను నాగరికుల నొనర్చుటకే. నేటిదినము కెన్యాలో తెల్లవారు హైందవులను దేశమునుండి పార ద్రోల జూచుచున్నారనిన అనాగరికులగు అచ్చటి నల్లజనమునువినాశమునుండి సంరక్షించుటకే. ఐ. సి. ఎస్ అధికారులు భారతభూమియందు తమకు గల యధికారమును వీడక యున్నారనిన మనచేత స్వపరిపాలనమార్గము నభ్యసింప జేయుటకే.

పైవ్రాసిన యుదాహరణము లన్నింటిని బట్టి మానవుడు వట్టి దాంభికుడని ప్రకటింపవలసియుండునే కాని నిజముగా లోకకల్యాణవాంఛ కలవాడని విశ్వసింప వీలులేదందువేమో! అట్టి తీర్మానము చేయావలదు. పశుబలము ప్రధానముగా గొని భ్రాతృవాత్సల్యమును నేనాడో పరలోకమున కనిచివేసి ఒండొరులం డీకొని పిఱుతివియక పెనంగుచు సర్వసస్యాఢ్యయగు భూమాతను నిజపుత్రసంఘంబుల రుధిరధారలచే నార్ద్రీకృతదేహం గావించుచుండు నేటి నాగరికరాష్ట్రములే శాంతిస్వరూపమును కనులార గాంచు భాగ్యము ఏనాడబ్బునోకదా యని తీక్ష్ణమగు హృదయసంవేదనను పొందుచున్నారనుటకు సందేహములేదు.

మహాసంగ్రామమునకు తరువాత నీసంవేదన స్పష్టతముముగా కన్పించినది. వర్సేల్సుసంధిమొదలు జినోవా, జినీవా, కాన్నీసు, లాసేనుఒకటి, లాసేనురెండు—ఎన్ని సమావేశము

తెన్నిసమావేశములు!! రుష్యాసమస్య, జర్మనీసమస్య, తుర్కీ సమస్య ఈసమస్యలను పరిష్కరించుకొనవలయునని పాశ్చాత్యులు జరిపిన చర్యయంతయు వారికి పశుబలమునెడల కలిగిన దుర్భరాసహ్యమును వెగటుందనమును ప్రకటించుచున్నవి. పరాసుభూమి రూరుప్రదేశము నాక్రమించుకొనినను జర్మనీ యుద్ధమునకు కడంగకుండుటయు ఇంగ్లండు మున్నగు ఇతర రాష్ట్రములు యుద్ధమును ప్రేరేచక ప్రవర్తించుటయుంగూడ పశుబలము నందలి విశ్వాసము నశించుచుండుటకు తార్కాణములు.

సంగ్రామారంభముననే అమెరికాఅధ్యక్షుడు పదునాల్గు షరత్తులు ప్రపంచశాంతికిగాను ప్రకటించుటయు అప్పుడే ఆషరత్తులను యుద్ధోన్మత్తజాతు లంగీకరింపకున్నను తరువాత సర్వజాతిసంఘ మను పేరిట (లీగు ఆఫ్ నేషన్సు) శాంతి నెలకొల్పునాధనమును స్థాపించు నుద్దేశము కొని తెల్లవారిమట్టుకైనను దానిని ఫలవంతముచేయ జూచుటయు మానవుని యందు శాంతిపక్షమున కలిగిన యభిమానమునే వ్యక్తపరచుచున్నవి.

మొన్నటి మహాసంగ్రామమునకు పూర్వము గూడ లోకశాంతిని సంపాదించుటకు రాజకీయరణరంగమున హోరాహోరిగ బోరుచుండిన రాష్ట్రములు ప్రయత్నములుచేయక పోలేదు. హేగుకన్ఫరెన్సని యొకానొకసంస్థ రాష్ట్రములు పరస్పరము సమాధానము కుదుర్చుకొనుట కేర్పడియుండినది కాని దానివలన కొంచెమైనను ఫలము కలుగలేదు.

ఇంతేకాదు. ప్రపంచకల్యాణమునకయి మానవులును

మానవసంఘములును, ఎట్లు ప్రవర్తింపవలయునో నిర్ణయించు టకు అనాదికాలములనుండి యఖండప్రయత్నములు జరిగి యున్నవి, జరుగుచున్నవి. హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, బౌద్ధ, జైన ఇత్యాది సర్వమతకర్తలును ఈప్రయత్నము చేసిన వారే కాని వేరుకారు.

ఎన్నిప్రయత్నము లిప్పటికి జరిగియున్నను నాగరికుల దృష్టి విపరీతవిషయానురక్తిపైనుండి చలింపనందున ఫలము కలుగలేదు. పశుబలము పరమసాధనమను ప్రబలవిశ్వాసము పట్టువదలనందున ప్రయోజనము కన్పించలేదు. సృష్టిలో ఈశ్వరుడు ఏప్రదేశమున కాప్రదేశమునందు ఉచితవస్తు సంచయము నిమిడ్చియున్నను దురాశచే కన్నులుగానక మానవుడు ప్రవర్తించుటచే శాంతిపథము దృగ్గోచరము కాలేదు. అయిన మహాసంగ్రామమధ్యమున నొక్క త్రుటి కాలమాత్రము పాశ్చాత్యరాష్ట్రములకు ఒక్క మెరపు మెరసినరీతిని విశ్వరూపసందర్శనము కలిగినది. ఏ రాష్ట్ర మున కారాష్ట్రము సంతుష్టిమై తనకు కావలసిన అన్న వస్త్రముల నిర్మించుకొనుట అత్యవసరమని వారిమానస మునకు తట్టినది. ముతకమైనను మోటమైనను స్వదేశనిర్మిత వస్తువు స్వసంరక్షణకును లోకశాంతికిని మార్గమని వారికి స్ఫురించినది. వారలప్పుడు నేటి ఆర్థికశాస్త్రమను వేదమును నుల్లంఘించి సెల్ఫుసఫిషియన్సీ అనగా రాష్ట్రీయసంపూర్ణత్వ ము అవసరమను సిద్ధాంతమును ప్రకటించినారు. ఆశ లనంత ములయిన నీ సిద్ధాంత మసంభవము. భారతభూమికి మాంచె స్టరుగుడ్డ రావలసియున్న నిత్యాది మిథ్య. దక్షిణాఫ్రికాకు

అమెరికా విప్లవకర్తలు దిగుమతికావలసియున్న నీ సూత్రము తెగనలసినదే. సంతుష్టి, శాంతి ఈ సూత్రమునకు పరమాధాగములు. వీని నాధారము చేసికొనియే రాజకీయవిషయములలో నింకొక సిద్ధాంతమునుకూడ పాశ్చాత్యులిప్పుడు ప్రకటించిరి. ఆ సిద్ధాంతమే స్వయంనిర్ణయసిద్ధాంతము. ఒకపరిపాలన పద్ధతి ప్రపంచమునకంతటికిని సరిపోదు. ఒకదేశమున కింకొక దేశము పరిపాలనపద్ధతిని నియమించుటకును వలంతికాదు. ఏదేశమున కాదేశము తన సహజగుణశీలములనుబట్టి తన స్వభావమునుబట్టి పరిపాలనపద్ధతి నియమించుకొనవలసియుండును. ఇదియే యీ సిద్ధాంతమునందలి రహస్యము.

భీభత్సపరిణామము కంటికి గట్టిన ట్లున్నంతకాలము పాశ్చాత్యుల కీరెండు సిద్ధాంతములును మరపునకు రాలేదు. ఆపరిణామ మొకకొంతమారినట్లు తోచుటతోనే వారు మరల తమ ప్రాత ఆర్థికశాస్త్రపు టాధారములకే మరలినారు.

అయిన లోకమున బీజప్రాయముగా కలిగిన తారక సందేశము నశించునదికాదు. మహాత్ముడు గాంధి దానిని విజృంభింపజేయువాడుగా నవతరించినాడు. భారతభూమి మహాసాత్త్వికశిరోమణులగు ఋషుల యావాసస్థానంబగుట ఆసందేశమును సాధించుటకు పరమాత్మచే నియోగితంబయి యున్నది. ఖద్దరు సత్యమునకు, శాంతికి, ధర్మమునకు, రాష్ట్రీయాత్మ సంపూర్ణత్వమునకు, స్వయంనిర్ణయసూత్రమునకు ప్రబలాంకముగా పరిణమించినది. ఈనూతనపథమున లోకశాంతి సమకూర్చునట్టి వోటు స్త్రీపురుష విభేదములేక ద్రవ్యాధికార ద్రవ్యాభావ వివక్షణలేక మారణయంత్రముల మహాభీతి

యాధారములేక సర్వసమానముగా పంచిపెట్టబడినది. ఈవోటుగెలిచెనా నిజమైనవోటు ప్రపంచమునకు ప్రసాదితము కాగలదు. అంతదనుక లోకమున ప్రచారమునుండువోటు మిథ్యగానుండక తప్పదు. దాని ననుకరించువాడు సృష్టిసంరక్షకుడుగాక సృష్టిసంహర్తకుడుగా నుండక మానడు.

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౬ | ౬ | కాలముయందు | కాలములందు |
| ౩౦ | ౧౪ | లిచ్ఛావిషయమున | లిచ్ఛవిషయము: |
| ,, | ౨౧ | తెలిసి | తెలిపి |
| ౨౭ | కడపటి నుంచి రెండవ | ఇతరునం | ఇచ్చటయం |
| ౮ | ౧౫ | బడికలదు. | బడికలదు |
| ౩౮ | ౧౧ | కాదు. | కాదు |
| ,, | ౨౨ | బ్రితినిధులే | ప్రితినిధులే |
| ౩౯ | కడపటి నుంచి మూడవ | వానిని | వారిని |
| ౫౩ | ౧౨ | నచో | నదో |
| ౫౭ | ౧౨ | మెయ్యాది | మియ్యాది |
| ౫౮ | ౧౮ | నాకర్షింప | నగుపింప |
| ౫౯ | ౬ | ఏనాడైనను | ఏవాడైనను |
| ౬౧ | ౧౪ | ఉన్నత | ఉన్న |
| ,, | ౧౭ | ఉన్నత | ఉన్న |

## గాంధిమహాత్ముని సంపూర్ణజీవితచరిత్ర.

మానికొండ సత్యనారాయణశాస్త్రిగారిచే వ్రాయబడినది. గాంధిమహాత్ముని శిష్యులగు దిగుమర్తి హనుమంతరావుగారిచే వారి అనుభవములతో కూడిన విపులమగు ఉపోద్ఘాతము వ్రాయబడినది. ధోవతిమాత్రము ధరించిన పటము ఇందుగలదు. వెల ౧-౮-౦

## గాంధిమహాత్ముని ఆరోగ్యమార్గబోధిని.

విపులముగ వ్రాయబడినది. సంకుచితముగా వ్రాయబడినదిగాదు. పెద్దలచ్చు ఆంధ్రభాషాపండితులగు భమిడిపాటి సూర్యనారాయణగారిచే సులభశైలిని వ్రాయబడినది, రెండుగకములైన పటములిందుగలవు. వెల ౦-౮-౦

## గాంధిమహాత్ముని సంపూర్ణఉపన్యాసములు, వ్యాసములు.

దక్షిణాఫ్రికాలో భారతీయులకొరకు పాటుపడుటకు ప్రారంభించినది మొదలు, అహమ్మదాబాదు కాంగ్రెసువరకు సంపూర్ణ ఉపన్యాసము, వ్యాసములును ౪ భాగములుగ ప్రకటించుచున్నాము. ౪ భాగములకు సొమ్ము ముందుగా పంపించినయెడల, రు ౪—౦—౦ లు మాత్రమే. ఆ భాగములు తయారుకాగానే ఖరీదు హెచ్చును.

వలయువారిట్లు వ్రాయవలెను:—

